# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము.

సంపుటము 34 జూలై 1991 సంచిక 7

విషయసూచిక




శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు

సంవత్సర చందా : తెలుగు లేక ఇంగ్లీష్ :

ఇండియా : రూ. 20/-, ఓవర్సీస్ : ఎయిర్ మెయిల్ రూ 140/-

సీ మెయిల్ రూ. 70/- U. S. $ 4.5, £ 2.5 U. S. $ 9, £ 5.00

ఆంధ్రప్రదేశ్, అనంతపురం జిల్లా, ప్రశాంతినిలయంలోని శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్సులో ప్రమోద్ కుమార్ సూరిచే " శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు " తరపున ముద్రింపబడి, ప్రచురింపబడినది. సంపాదకుడు : వి. కె. నరసింహన్.

# మానవజన్మ - దైవాన్వేషణ

' విశ్వవిభుడు విశ్వమంతా ప్రకాశించుచుండును. అట్లే విభునియందు విశ్వమంత వెలుగొందు చుండును. ఈ హేతువు చేత విశ్వవిభుల మైత్రి విడదీయరాని అనుబంధం. అదే సాయిమాట— అదే సత్యమైనబాట ".

ప్రేమస్వరూపులారా !

ఈ జగత్తు ఈశ్వరుడు నివసింపతగినది. ఈ జగత్తంతయు పరమేశ్వరుడు వ్యాపించి యున్నాడు. అందుచేతనే, "ఈశావాస్య మిదం జగత్" అని చెప్పబడినది. ఈశ్వరుడు నివసించని చోటు లేదు. జగత్తు అనగా మనము పుట్టి, పెరిగి, తిరిగి పోయే లోకము. ఈ లోకమునకు ఆధారం భూమి. ఎడతెరిపి లేకుండా ఇంటా, బయటా, సర్వత్రా, సర్వకాలముల యందు గాలి వీచుచున్నది. కాని ఇది మానవునికి కని పించదు. పగలు, వెలుతురు, ఆహారవిహారకార్య కలాపాలు జరుగుతునే ఉంటాయి. రాత్రి కాగానే ప్రకృతి నిశ్శబ్దముగా నిద్రపోతుంది. పగలు వెలుతురుతో ప్రకాశిస్తుంది. రాత్రి చీకటితో రాణిస్తుంది. ఈ వెలుగునకూ, చీకటికీ మధ్య ఉన్న సంబంధ బాంధవ్యాన్ని మానవుడు గుర్తించడము అత్యవసరం. మానవుడు తాను తన తల పైకెత్తి చూచినప్పుడు, అనంతమైన ఆకాశములో ప్రకాశిస్తున్న సూర్యుడు దేదీప్యమానంగా, తేజోవంతంగా కనిపిస్తూ ఉంటాడు. అంతులేని ఆకాశములో అనంతంగా ప్రకాశించే సూర్యుడు ఒక్కడే. ప్రతిక్షణం ఈ జగత్తునందు ఏవో కొన్ని రకములైన కర్మలు జరుగుతునే ఉంటున్నాయి- జరుగుతునే ఉంటాయి. పుణ్యములు, పురుషార్థములు, చావుపుట్టుకలు, పెండ్లిపేరంటాలు- ఇవన్నీ నిర్విరామముగా జరుగుతూనే "మానవజీవితం" నవ్వులతో, ఏడ్పులతో ముగిసిపోతూ ఉంటుంది. దీనికి అంతమే లేదు.

## మానవుని ప్రారంభదశ

మానవుడు పుట్టగానే ఆతనిని ఆకలి వెంటాడుతుంది. నాభినాళమును మనం త్రుంచగానే బిడ్డ కెవ్వు, కెవ్వుమని ఏడుస్తుంది. ఆ బిడ్డకు తేనె పెట్టినప్పుడు, గ్లూకోసో లేక పాలనో నాలుకకు రాసినప్పుడు ఆ బిడ్డ ఏడుపు చల్లారుతుంది. మొట్టమొదట మానవుని పీడించేది, అలమటింపచేసేది ఆకలి. ఈ ఆకలికి ధాన్యం అత్యవసరము. ఈ ధాన్యము కేవలము నీటిద్వారానే మనకు లభ్యమవుతుంది. ఎన్ని యంత్రములు, మరెన్ని తంత్రములు కనిపెట్టినను ఆకలి బాధను

తీర్చునది అన్నమే కాని యంత్రతంత్రములు కావు. భూమాత నీళ్ళను త్రాగి మానవునకు ధాన్యము అందిస్తుంది. ఈ రీతిగా ఆహారవిహారములు అభివృద్ధికాగానే మానవుల జనాభా లెక్క దినదినానికి పెరిగిపోతూ వచ్చింది. దీని తరువాత పాడిపంటలు, గుడిసెలు, గృహాలు, పల్లెలు, పట్టణాలు పెరుగుతూ వచ్చాయి. ఈ విధముగనే మానవ జీవితం దినదినాభివృద్ధిని పొందుతూ, జీవితమునకు అవసరమైన విషయాలను చక్కగా అర్థము చేసుకుంటూ, సమకూర్చుకొంటూ వచ్చింది.

## మానవుడు చేయలేని పని

మానవత్వము కొన్ని రహస్యములను కూడా గుర్తించుకుంటూ వచ్చింది. అట్లే నిత్యజీవితమునకు అవసరమైనవాటినే ప్రోగుచేసుకుంటూ వచ్చింది. ఇంతేకాక తనకు తెలియనివి అనేకమైనవి ఉన్నవని కూడా కనిపెడుతూ వచ్చింది. తాను తెలుసుకొన్నది తక్కువ అని, తెలుసుకోవలసినది చాలా ఎక్కువని మానవత్వం గమనించుకొన్నది. మానవుడు భూమిని, నీటిని సృష్టించలేడు. కొమ్మకు కొమ్మకు రాపిడి జరిగినప్పుడు అగ్ని కలుగుతున్నది. కాని కొమ్మలో అగ్నిని పెట్టి నిలబెట్టలేడు, ఇది మానవునికి చేతగాని పని. కొమ్మలో అగ్ని ఉన్నది కాని, ఆ అగ్ని ఆ కొమ్మను కాల్చకుండా కాపాడుతుంది. ఆ పనినికూడా మానవుడు చేయలేడు. కాబట్టి మన కంటికి కనిపించక, చెవులకు వినిపించక, మనస్సునకనిపించక— ఏదో ఒక ఊహింపరాని మహత్తరమైన శక్తి అంతర్యాతమై ఉన్నదని మానవుడు కొంతవరకు గుర్తించుకొన్నాడు. అది మానవాతీతమైన శక్తి అని గుర్తించడం, ఊహించడం జరిగింది.

## ప్రత్యక్షప్రమాణం సూర్యభగవానుడే

ఏ శక్తికైనా ప్రత్యక్షప్రమాణము అత్యవసరము. మనకు ప్రత్యక్షప్రమాణము సూర్యభగవానుడే అని విశ్వాసాన్ని పొందుతూ వచ్చాడు మానవుడు. సూర్యుడు లేకపోయిన వెలుతురు లేదు. వెలుతురు మాత్రమే కాదు, సృష్టికూడా స్తంభించిపోతుంది. ఈ ప్రపంచములో ఏ ఏ వృక్షములు ఎప్పుడెప్పుడు అభివృద్ధి కావలెనన్నా, ఎటువంటి పంటలు పండవలెనన్నా, ఏ జీవి పెరగవలెనన్నా ఇవన్నింటికీ హైడ్రోజన్ అత్యవసరము. ఈ సూర్యుని ప్రధానమైన శక్తి- హైడ్రోజన్, హీలియం. ఈ హైడ్రోజన్, హీలియం రెండూ లేకుండాపోతే అసలు జగత్తే లేదు. కనుక ప్రత్యక్షప్రమాణము మనకు సూర్యభగవానుడే అని విశ్వాసం పెంచుకొన్నారు. ఈ సూర్యతత్త్వమందు అనేక విధములైన రహస్యాలు గుర్తించుతూవచ్చారు.

## సూర్యాధారం గాయత్రీమంత్రం

క్రమక్రమేణా "గాయత్రీమంత్రము" నందు ఈ సూర్యుని ప్రధానమైన దైవముగా విశ్వసిస్తూ వచ్చారు. "ధీయోయోనః ప్రచోదయాత్" అనగా సూర్యుడు ప్రకాశించినట్లు మానవుని బుద్ధి కూడా అమితంగా ప్రకాశించాలి. సూర్యప్రకాశము మన బుద్ధిలో ప్రవేశించాలి అనే ప్రార్థనలు మానవులు సల్పుతూవచ్చారు. ఈ హేతువుచేత ప్రత్యక్షప్రమాణముతో పాటు ఆధారం కూడా సూర్యభగవానుడే. ఈ సూర్యాధారమును పురస్కరించుకొని గాయత్రీ మంత్రం ఉచ్చరించుకుంటూ, గాయత్రియే వేదమాత అని ప్రగాఢ విశ్వాసము పొందుతూ వచ్చారు. ఈ గాయత్రి కేవలం ఒక కాలమునకు, ఒక దేశమునకు, ఒక పాత్రకు సంబంధించినది కాదని, త్రికాలములకు సంబంధించినదని నమ్ముకొన్నారు. చీకటిని రూపుమాపేది వెలుగు. వెలుగు లేకుండా చీకటి ఏమాత్రము దూరంకాదు. కనుకనే, "భర్గోదేవస్య ధీమహి" అన్నారు. ఈ చీకటిని రూపుమాపే సూర్యుడు ఈ గాయత్రి రూపములో ప్రధాన స్థానమును ఆక్రమించుకొని యున్నాడు. ఈ విధముగా ఏదో ఒక శక్తి ఉన్నదని, ఆ శక్తియే దైవమని తమలో తాము విశ్వాసం పెంచుకుంటూ వచ్చారు.

## ఋషినిర్ధారణ

ప్రపంచంలో అతీతమైన శక్తి ఒకటి ఉన్నదని, ఆ శక్తి ఒక్కటే కాని రెండు కాదని విశ్వాసము కలిగించుకుంటూ వచ్చారు. ఆ ఒక్కటే అనేకమైన రూపాలు ధరించి, అనేక రూప నామాలచేత ఈ జగత్తంతయు వ్యాపించియున్నది. ఈ సత్యాన్ని పురస్కరించుకొని "ఈశావాస్య మిదం జగత్" అని చెప్పడం జరిగింది. దీనినే ఆనాటి ప్రజలు "ఆదిత్యః" అని పిలుస్తూ వచ్చారు. ఆదిత్యుడనగా విష్ణువు-విష్ణువనగా సర్వవ్యాపకత్వము కలవాడు. "ఆదిత్యః" అనగా ద్వాదశాదిత్యులలో ఆదిత్యుడొకడు. ఆతనే విష్ణువని, "విష్ణుః" అనగా కేవలము శంఖు, చక్ర, గదా, పద్మములతో కూడినవాడు కాదనియు, సర్వ వ్యాపకమైన తత్త్వమని గుర్తించడం జరిగింది. ఇటువంటి విష్ణుత్వానికి మనము ఒక రూపాన్ని కల్పించుకుంటూ వచ్చాము.

ఈ దేహము మృణ్మయమైన దేహము. ఈ మృణ్మయమైన పాత్రయందు చిన్మయమైన దివ్యత్వం ఉన్నది. ఆతడే "హిరణ్యగర్భుడు". అతనినే "ఈశ్వరః" అన్నారు. అనగా నిరుపమానమైన ఐశ్వర్యము కలవాడని అర్థము. నిరుపాధికమైన ఐశ్వర్యము అనగా ఆరోగ్యభాగ్యాలు (Health and Wealth). ధనమూ ఒక ధనమే, కాని ఆరోగ్యము కూడా ధనమే. విద్య, గుణం, తెలివి మున్నగు వాటిని కూడ ధనములుగానే భావిస్తూ, పోల్చుకుంటూ వచ్చారు. ఇవన్నీ కూడా ఒక విధమైన ధనములే. సకలైశ్వర్య స్వరూపుడు ఈశ్వరుడు అనే సత్యాన్ని మానవుడు విశ్వసించడానికి ప్రారంభించాడు తరువాత ఇందులో ఉన్న రహస్యాన్ని గుర్తించి, ఈశ్వరుణ్ణి "శివః" అని పిలుస్తూ వచ్చారు. "శివః" అనగా త్రైగుణ్య రహితుడు. సత్వరజస్తమో గుణములకు అతీతమైనవాడు. గుణములు లేనివాడు కనుక ఇతడు "శుద్ధ సత్వుడు". ఆ శుద్ధసత్వుడే శివుడు. అదే మంగళకరమైన తత్త్వం. గుణములు లేనప్పుడే మంగళత్వము ఏర్పడుతుంది. గుణములు ఉండినప్పుడే అమంగళము ఏర్పడుతుంది. కనుక "శివః" అనగా గుణాతీతుడు, మంగళస్వరూపుడు. ఈ విధముగా మానవుడు ఉన్నత భావాలు తనలో యోచిస్తూవచ్చాడు. అందువలన "సంభవః" అని నాల్గవపేరు పెడుతూ వచ్చాడు.

"సంభవ" మనగా తన ఇష్టప్రకారముగా ఏ నియమాలు లేకుండా ఎప్పుడు, ఎక్కడ అవసరమో అప్పుడు, అక్కడ తాను ఉద్భవించగలిగినవాడని భావము. కాబట్టి "సంభవః" అన్నారు. అందువలననే భగవద్గీతలో—

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే"

సంభవామి- ఎక్కడెక్కడ అవసరమో అక్కడక్కడంతా తానుద్భవిస్తూ ఉంటాడు. అటువంటి స్వాతంత్ర్యము కలవాడు కనుకనే ఈ విధంగా ఒక్కొక్క అంతరార్థమును పురస్కరించుకొని ఒక్కొక్క పేరు పెడుతూ వచ్చారు. ఇతనికి "ఈశ" అని మరొక పేరు పెట్టారు. ఉదా:- "ఈశ, గిరీశ, నరేశ, పరేశ, సురేశ". ఈ మానవుని తెలివితేటలు ఎంత ఘనమైనవిగా అభివృద్ధిని పొందుతూవచ్చాయో, చక్కగా గుర్తించుకోవడానికి ప్రయత్నించాలి. "ఈశ" అనగా ఐశ్వర్యం, ధనం, కీర్తి, యశస్సు, జ్ఞానం, వైరాగ్యం మున్నగు షడైశ్వర్యములు కలవాడు. ఈ షడైశ్వర్య స్వరూపుడు ఈశ్వరుడు అనే తత్త్వానికి "ఈశ" అనే పేరు పెట్టుకుంటూ వచ్చారు. తదుపరి మానవుని మనస్సు, తెలివితేటలు దినదినాభివృద్ధి పొందుతూ వచ్చాయి. కట్టకడపటికి "అప్రమేయః" అన్నారు. "అప్రమేయుడు" అనగా ఎట్టి ప్రమాణములకూ చిక్కనివాడు. ఒక చేపుతో సముద్రాన్ని కొలువ వచ్చును. అంతేకాకుండా ఆకాశమును కూడా కొల్వ

వచ్చును. కాని భగవంతునికి కొలతబద్ద అనునది ఏదియూ లేదు. ప్రత్యక్షప్రమాణము, అనుమాన ప్రమాణము, శబ్దప్రమాణము అను మూడు ప్రమాణములకు అతీతమైనవాడు భగవంతుడు. కనుకనే అట్టి భగవంతుడు అప్రమేయుడగుట వలన సర్వత్రా వ్యాపించియున్నాడని చెప్పవలెను.

## తామసము - రాజసము - సాత్త్వికము

భగవత్త్వమనేది లేకపోతే ఈ ప్రపంచమే లేదు. ఇటువంటి భగవంతుని ప్రత్యక్షముగా గుర్తించాలని అనేకమంది ఋషులు తపస్సు చేస్తూవచ్చారు. మానవజీవితము యొక్క పరమావధి దివ్యత్వమును గుర్తించడమే. దివ్యత్వమును గుర్తించుటకై కొంతమంది ప్రయత్నము చేస్తూ-చేస్తూ ఆగిపోయి, మరి కొందరు అలసిపోయి విరమించుకొన్నారు. మానవత్వమెక్కడ? దైవత్వమెక్కడ? దానికి, దీనికి ఎట్టి సంబంధము లేదని, అతీతమైనతత్త్వాన్ని గుర్తించుకోవడం అసాధ్యమని ప్రారంభదశలో మరి కొందరు విరమించుకొన్నారు. ఆ దివ్యత్వము నుండి వచ్చినదే ఈ పవిత్రమైన మానవజీవితము. ఈ లక్ష్యాన్ని కొంతమంది ఋషులు గుర్తించి, దీక్షనుపట్టి సాధిస్తూవచ్చారు. "ఈ దివ్యమైన తేజస్సు మీరు చూడండి" అని లోకానికి చాటినారు. "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః" ఆతడు ఎట్లున్నాడంటే, "వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" అని అన్నారు. ఆ మహాపురుషుని ఏ విధంగా వర్ణించడానికి వీలుకాదని సూర్యతేజస్సువలె ప్రకాశిస్తున్నాడని పేర్కొన్నారు.

ఆతడు ఎక్కడున్నాడంటే తమస్సుకు ఆవల ఉంటున్నాడని, తమస్సు వదిలితేగాని ఈ తేజస్సు మనకు ప్రాప్తించదని ఋషులు మనకు బోధించారు. తమస్సును దూరం చేయాలి. ఈ దేహము కేవలము తిండితీర్థాలకై వచ్చినది కాదు. ఆహార, నిద్ర, భయములతో కూడి ఉండేదే పశుత్వము. దీనికి అతీతమైన గుణము మరి యొకటి ఉన్నది. అదే దివ్యమైన శక్తి- జ్ఞానము (Discrimination Power). తమస్సు పోతేగాని పవిత్రమైన జ్ఞానము కలుగదు. తమస్సు పోయిన తరువాత రాజసము ఉంటుంది. ఈ రాజసమనేది అనేక కోరికలతో నిండియుంటుంది. ఈ రాజసమును దూరం చేయాలి. అప్పుడే సాత్వికము ఆవిర్భవిస్తుంది. ఈ సాత్వికము ఆవిర్భవించినప్పుడే తేజోమయమైన దివ్యత్వము మనకు కనిపిసుంది.

వేదము మహా అగాధమైనది. రహస్యమైనది. శ్రద్ధాభక్తులు కలిగిన వారికి ఇది చాలా సులభమార్గం. కన్నులు తెరచిన వానికి లక్షలమైళ్ళలో అంతరిక్షంలో ఉన్న నక్షత్రాలు కనిపిస్తాయి. కనుక మన శ్రద్ధ, భక్తి అనే నేత్రాలను విప్పాలి. విప్పవలసినవి చర్మ చక్షువులు కావు: జ్ఞాన చక్షువులు. వానిని మనము తెరచినపుడు దివ్యత్వమైన ప్రకాశం సర్వత్రా మనకు గోచరిస్తుంది.

## జననమరణాలు

మానవుడు అన్నీ కనిపెడుతున్నాడు కాని చిట్టచివరికి జనన మరణములకు కారణము ఏమిటి? అనే విషయాలను కనిపెట్టలేక పోతున్నాడు. దీని రహస్యం "జాతస్య మరణం ధ్రువం" అని తేలింది. అనగా పుట్టినవాడు మరణించక తప్పదు. కాని చచ్చినవాడు తిరిగి పుడతాడో, లేదో అన్న విషయం మనకు తెలియదు. ఈ రెండింటి రహస్యాన్ని తెలుసుకోవడానికి మహర్షులు ప్రయత్నం చేశారు. చిట్టచివరికి ఇది కేవలం మానవాతీతమైనదని ఋషులు చెప్పుతూ వచ్చారు. ఇది భగవంతుని సంకల్పం చేత జరిగేది కాని మానవుని యత్నప్రయత్నములతో జరిగేది కాదని తెలుసుకొన్నారు.

జీవించాలని అనుకుంటే మానవుడు ఎంతకాలమైనా జీవించ గలుగుతున్నాడా? మరణమునకు ఆరోగ్యము కాని, శక్తిసామర్థ్యములు కాని ధన, కనక, వస్తు

వాహనాదులు కాని కారణములు కావు. దీనికి ఒక్కటే కారణము. అది దైవానుగ్రహం లేకపోవుటయే. మానవ ప్రయత్నాలు లేకుండా జరిగేవి అనేకములు జరుగుతున్నాయి. మానవుని గుండె కొట్టుకొనుటకు, అతని ఉచ్ఛ్వాస నిశ్వాసములు పీల్చుటకు, వదలుటకు అతడు ఏమి ప్రయత్నము చేస్తున్నాడు? అంతేకాదు, అతని దేహములో రక్తప్రసారం జరగడానికి ఏ ప్రయత్నం జరుగుతోంది? ఇవన్నీ యత్నప్రయత్నాలలో జరిగేవి కావు. ఇవన్నీ జరుగుటకు దైవసంకల్పమే కారణము. దానికి మించినది మరియొకటి లేదు.

ఆయువును ఇంతవరకు, అంతవరకని ఎవ్వరూ నిర్ణయించలేరు. "శతవర్షములదాక మితమని చెప్పిరి కాని, మనస్సున ఆమాట నమ్మరాదు. బాల్యమందో లేక ప్రాయమందో లేక ముదిమియందో కాక ఎప్పుడో, ఏ వేళనో పోయే ప్రాణము విషయము ఎవ్వరూ చెప్పలేరు. అంతేకాక గ్రామమందో, అడవి యందో లేక ఉదక మధ్యమందో ఎప్పుడు ప్రాణము దేహమును వీడునో గుర్తింపరాదు. కాబట్టి ప్రాణమున్నంత లోపలనే తన్ను తాను తెలిసికొనుట ముఖ్యము." మన ప్రాణమున్నంత లోపలనే భగవంతుని తెలిసికోవాలి. ఎప్పుడో ఏమో అనే విషయాన్ని ఎవరూ చెప్పలేరు. దీనిని కాన్సిల్ (Cancel) చేయడానికి ఎవరికీ వీలుకాదు. ఇది కేవలము దైవానుగ్రహంతో జరిగేది.

## విద్యుల్లేఖేవ భాస్వరా

ప్రాణరక్షణ నిమిత్తమై దైవాన్ని ప్రార్థించమని మహర్షులు ప్రబోధిస్తూ వచ్చారు. ఈ ప్రాణము "నీలతోయద మధ్యస్థాత్ విద్యుల్లేఖేవ భాస్వరా" వెనుక వైపునకు 33 రింగులతో కూడిన Spinal Chord ఉంటుంది. దానియందు 9 మరియు 12వ రింగుల మధ్య సుషుమ్న నాడి కలదు. అదే విద్యుల్లేఖ వలె కదలుతుంది. ఆ Lightning వలననే దేహమంతా పనిచేస్తుంది. కొంతమంది మన ప్రాణము Heart లో ఉంటుందంటారు. Heart అనేది కేవలము Main Switch వంటిది. కాని ప్రాణము అక్కడ లేదు. డాక్టర్లు Heart ని తీసి వేరొక Heart మారుస్తున్నారే! ఆ సమయమున ఈ ప్రాణము ఏమైపోతుంది? ఇది కేవలం Main Switch ని మార్పిడి చేయడం మాత్రమే జరుగుతోంది. కాని అక్కడ Spinal Column లో దాని ప్రభావము చేతనే Heart పనిచేస్తుంది. కనుకనే ఆనాటి వేద పురుషులంతా ఏమీ తెలియని మూర్ఖులని, ఏ మాత్రము జ్ఞానము లేని, సైన్సు తెలియని అమాయకులుగా భావించరాదు. ఈనాటి సైంటిస్టులకు తెలిసిన దానికంటే వారికి మరింత అధికముగానే తెలిసియుండినది. దీనికంతటికి వారి తపశ్శక్తియే కారణము. ఎన్ని వేలమైళ్ళ దూరములో ఉండి తపస్సు చేస్తున్నప్పటికిని, దూరదర్శనము వారికి ప్రాప్తించినది. ప్రకృతితో ముఖాముఖిగా సంభాషణలు సల్పేవారు. ఈనాడు దూరదర్శనమని, దూరశ్రవణమని కోట్ల కొలది ఖర్చుపెట్టి అనుభవిస్తున్నాము. ఒక్క నయాపైసా ఖర్చులేదు ఆనాడు. మనస్సు పవిత్రమైన దివ్యత్వముగా మార్చుకోవటం చేతనే ఇన్ని శక్తులు వారికి కలుగుతూ వచ్చాయి.

## విద్యతో బాటు వినయం నేర్చుకో

విద్యార్థులారా! మానవుడు మొదటి స్థాయి నుండి ఎంతవరకు ఏ ఏ రీతిగా పెరుగుతూ వచ్చాడో మనము చక్కగా విచారణ చేయాలి. పుట్టిన తక్షణమే ఎవ్వడూ పండితుడు, విద్యావంతుడూ కాలేడు. మన శ్రద్ధాభక్తుల చేతనే క్రమక్రమేణా ఉన్నత స్థాయికి పోతాము. "సాధనమున పనులు సమకూరు ధరలోన." కాబట్టి మనకు తెలియదు, తెలియదని విసర్జించరాదు. తెలియనిదానినే మనము సాధించాలి. దానికి ప్రయత్నించాలి. అదే ఆనాటి మహర్షులు చేసిన సాధన. సుఖంగా ఉండి, ప్రయత్నము జరగాలని అనుకొన్నవాడు దేనినీ సాధించలేడు. సాధించాలని శ్రద్ధ కలిగి

నవాడు సుఖాన్ని ఆశించకూడదు. సుఖవంతుడు దేనినీ సాధించలేడు. తన సర్వస్వాన్ని త్యాగంచేసి దైవానికి అర్పితం కావాలి. అప్పుడే అతీతమైన విద్యలు అన్నీ ప్రాప్తిస్తాయి. ఎన్ని విద్యలు అభ్యసించినప్పటికి, ఎన్ని శక్తులు సాధించినప్పటికి ఆనాటి మహర్షులు కించిత్తైనా అహంకారాన్ని పొందలేదు. వారి హృదయంలో అహంకారము ఎక్కడా కనిపించేదికాదు. ఈనాటి సైంటిస్టులయందుగాని, పరిశోధకులయందుగాని, శాస్త్రజ్ఞులయందుగాని కించిత్తు సాధించినచో వారిని పట్టడానికి ఎవ్వరి తరము కాదు. ఈ అహంకారముతో తలకూడా ఎగిరిపోతూ ఉంటుంది. నిజమైన విద్యావంతులకు అహంకారము ఉండదు. ఉండుటకు వీలులేదు. కనుక విద్యార్థులయందు అహంకారము ఏమాత్రము తలయెత్తి విజృంభించరాదు. వినయమే విద్యయొక్క ప్రధానలక్షణము.

## దైవానుగ్రహం సాధించు

ఈనాడు సైన్సు సాధించినది ఏమిటి? ఏ మాత్రమూ మనమింకా సాధింపలేదు. మన బుద్ధుల యొక్క కొలతలు పురస్కరించుకొని గొప్పగా సాధించామని అనుకుంటున్నాము ఉదా: సూర్యునిలో ఉన్న Energy 3000 భాగములలో రెండింటిని మాత్రమే సైంటిస్ట్‌లు అనుభవిస్తున్నారు. ఇంకా 2998 పాళ్ళు Energy అట్లే ఉంది. ఈ రెండింటితోనే ఇంతశక్తి ప్రపంచమందు వ్యాపించి యుండినప్పుడు ఇంక మిగిలిన 2998 పాళ్ళ Energy ఉపయోగిస్తే, ప్రపంచమే దేదీప్యమానంగా వెలుగుతుంది. కనుక దైవానుగ్రహ కిరణం వచ్చిందంటే ఎంతైనా సాధించవచ్చు. "నీ అనుగ్రహకిరణములలో అణుమాత్రమైనా ప్రసాదించు" అని మహర్షులు భగవంతుని కోరుతూ వచ్చారు. దైవశక్తిని కించిత్తు మనము సాధిస్తే అనంతమైన దానిని మనము సాధింపవచ్చు. దైవానుగ్రహం లేకపోతే ఎవరూ ఏదీ సాధింపవీలు కాదు. ఎగరటానికి ఇష్టం లేకపోతే గ్రద్ద ఒక ఇంచైనా ముందుకు పోదు. నడవడానికి ప్రయత్నిస్తే చీమ కొన్ని మైళ్ళదూరం నడచి పోతుంది. ప్రయత్నం అత్యవసరం. "యత్నప్రయత్నములు మానవ ధర్మము, జయాపజయములు దైవాధీనములు" కనుక దైవాధీనము పైపునకు వెళ్ళేవానికి అంతా విజయమే.

## సంపూర్ణ శరణాగతి

విద్యార్థులారా! మానవుడు దివ్యత్వాన్ని ఎట్లు చేరాలి? ఏ విధంగా సాధించాలి? అనే ప్రశ్నకు మనము ఏ విధమైన సాధన చేయనవసరం లేదు. గజేంద్రుడు మొసలితో తన భుజబల శక్తితో, తన దేహశక్తితో కొన్ని వేల సంవత్సరాలు పోరాడినప్పటికి, తను బాధనుండి తప్పించుకొనలేక పోయాడు. చిట్ట చివరకు అలసిపోయి "నీవే తప్ప ఇతఃపరంబెరుగ, మన్నింపన్ దగున్" అని భగవంతుని ప్రార్థించినాడు. నీవు తప్ప నాకు దిక్కెవరూ లేరని అర్థితో పల్కినాడు. అతని సంపూర్ణ శరణాగతి భగవంతుడు గ్రహించి, రక్షించడము జరిగింది. ఇదే రీతిగా అర్జునుడు కూడా చేతులు జోడించుకొని కృష్ణునితో "కరిష్యే వచనం తవ" అని పల్కినాడు. అందు చేతనే కృష్ణానుగ్రహముతో విజయుడైనాడు.

## రామనామం - రామకార్యం

విద్యార్థులారా! సత్సంగములో చేరి, సత్కర్మలు ఆచరించినప్పుడే మన భక్తిశ్రద్ధలు ఏమాత్రం మారక, చెదరక, కదలక ఉంటాయి కేవలము నోటితో మంత్రాలను చెప్పిన చాలదు. భగవంతుని నామాన్ని ఉచ్చరించినంత మాత్రాన చాలదు. భగవత్కర్మలయందు ప్రవేశించాలి. హనుమంతుడు విభీషణుని స్నేహమును ఏర్పరచినాడు. ఒకనాడు

విభీషణుడు చాలా బాధపడుచూ హనుమంతుని చూచి, "హనుమంతా! ఎంత అదృష్టవంతుడవోయీ! నిరంతరం రామసేవ చేస్తూ రామానుగ్రహం పొందావు. ఎంత కాలం నుండియో రామనామాన్ని స్మరిస్తున్నాను, కాని రామదర్శనము నాకు ప్రాప్తించ లేదు" అని పల్కినాడు. ఈ మాటలు విన్నంతనే హనుమంతుడు, "విభీషణా! రామనామాన్ని స్మరిస్తున్నావే కాని, రామకార్యంలో ఏమైనా పాల్గొంటున్నావా? రామ కార్యంలో పాల్గొనకపోయినచో రామానుగ్రహం నీకు ఎట్లు లభ్యమగును? ఈ లంకాసామ్రాజ్యంలో సీతాదేవి ప్రవేశించి 10 నెలలు అయినది. నీవు ఆ సీతమ్మతల్లికి ఉపశాంతి కలుగునట్లు ఏమైనా బోధించితివా? లేక ఆ తల్లిని ఒకతూరియైనా దర్శించితివా? ఆమె బాధను నివారించడానికి ఏమైనా కొన్ని ఉపాయములు ఆలోచించినావా? నేను అడిగిన ప్రశ్నలు నీవు ఆచరించియున్నచో, అదంతయు రామసేవగా మారి యుండెడిది గదా! ఆరీతిగా చేయవైతివి. ఇంక నీకు రామానుగ్రహం ఏరీతిగా కలుగుతుంది? నేను రామ నామం నోటిలోను, జీవితాన్ని రామకార్యంలో అంకితం చేసాను" అని పల్కినాడు. కాబట్టి మనము చేయవలసినది, "దిల్ మే రామ్, హాత్ మే కామ్". మనం ఈ రెండింటికీ మన జీవితాన్ని అంకితం చేయాలి. ఇదే ఆనాటి మహర్షుల సాధన. ఆనాటి పరిశోధనలు పవిత్రమైన పరిశోధనలు. మానవుడు సామాన్యుడు కాదు. "జంతూనాం నరజన్మ దుర్లభం". మానవ జన్మ చాలా దుర్లభమైనది. అటువంటి మానవత్వాన్ని మనము సార్థకము గావించుకోవాలనుకుంటే సాధ్యమైనంతవరకు దైవచింతన, దైవాన్వేషణ చేయాలి అందులో ప్రవేశించాలి.

## న్యూస్ న్యూసెన్సు

మానవుడు దైవత్వాన్ని ఏరీతిగా చేరగలడు? అనే విషయాన్ని తెలుసుకొనుట చాలా అవసరము. మానవుడై పుట్టినందుకు మాధవత్వము గుర్తించుకొనుట చాలా ప్రధానమైన సమస్య. ఎక్కడెక్కడనో, ఏఏదేశములందో జరుగుచున్న వార్తలంతా మానవుడు వింటున్నాడు. కానీ తననుండి వచ్చే వార్తలు తాను గుర్తించలేకపోతున్నాడు. బయటి నుంచి వచ్చే "న్యూస్" కంటే తనలోనుంచి వచ్చే "న్యూసెన్సు" చాలా అధికముగా పెరుగుతోంది. ఆ "న్యూస్"ను మనం దూరం చేస్తే, ఈ "న్యూసెన్సు" అంతా దూరమైపోతుంది. అప్పుడు మనలో పవిత్రమైన దైవత్వాన్ని నింపుకోవచ్చు. ఏ శాస్త్రమునందుగాని, ఏ ఉపనిషత్తునందుగాని, వేదమునందుగాని లేనటువంటిది లేదు. అన్నీ వేదస్వరూపములే. దాన్ని విపులంగా విచారించే వ్యక్తులు లేకపోవుట చేతనే అంతా అర్థం చేసుకోలేకపోతున్నారు. వాటినన్నింటినీ నేను సులభముగా, మీ స్థాయికి తగినట్లుగా, అనుకూలవంతముగా, ఆదర్శవంతముగా, సాధనకుపకరించు రీతిగా తప్పక చెప్పి మీ హృదయాలను పవిత్రవంతము గావించాలని నేను సంకల్పించుకొన్నాను.

—శ్రీవారి దివ్యబోధ
21—5—1991,
బృందావనం.



## ఆర్తిదీర్పగరావోయి! పర్తివాస!!

సాయీశ ! నీ ముఖ-సందర్శనంబున
కామితార్థంబులు-కలుగగలవు,
సాయీశ ! నీ నామ-సంకీర్తనంబున
పాపజాలంబెల్ల-రూపుమాయు,
సాయీశ ! నీ చూపు-సన్మార్గమున జన
కైవల్య సదనంబు-కాంచనగును,
సాయీశ ! నీ దివ్య-సంస్కారయుత బోధ
నాలింప ఇహపర-యాశలుడుగు,

శాంతిమయరూప, సర్వేశ-సత్యసాయి,
సర్వమంగళ గుణరూప-నిర్వికార,
శరణు శరణంచు వినువేడు-సర్వజనుల,
ఆర్తిదీర్పగరావోయి ! పర్తివాస ! !

—"కవికులం" నారాయణాచార్య,
మదనపల్లి (చిత్తూరు జిల్లా)

## సాయి మురళీరవళి!

సస్యశ్యామల జీవధాత్రియై,
జీవన మృదంగలయకల్పితమై,
పావన గంగాప్రవాహగీతిక-
పల్లవించుతూ, ఆలపిస్తూ,
పారవశ్యమును ఆస్వాదిస్తూ-
నిర్మల, నిశ్చల మోహరాగమున-
వేణుగానమును ఆపాదిస్తూ
సాయికృష్ణ అట వినిపిస్తుంటే-
జీవరహితమై పడివున్నట్టి-
రాయియు, రప్పయు-
గొంతుకలపదా - ఆనందముతో
పల్లవికాదా ఆ పాటలలో !

—కె. వి. కృష్ణశాస్త్రి, ద్వితీయ బి. కాం.,
ప్రశాంతినిలయం.

---

### చందాదారులకు విజ్ఞప్తి

(ఏ) వార్షిక చందా 20 రూపాయలు మనియార్డరు ద్వారా— కన్వీనరు, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్సు ట్రస్టు, ప్రశాంతినిలయం (పోస్టు), అనంతపురం జిల్లా, ఏ. పి. — 515 134 కు పంపవలెను.

(బి) వేరుగా ఎక్నాలెడ్జిమెంటు కోరువారు తమ చిరునామాగల రిప్లైకార్డు పంపవలెను.

(సి) చందాలు ఒక సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడగలవు.

(డి) చందాదారు పూర్తిపేరు, చిరునామా మనియార్డరు కూపను (సమాచార్ అనుచోట) పైననే స్పష్టముగా పెద్ద అక్షరాలతో వ్రాసి పంపవలెను.

(ఇ) మనియార్డరు కూపనుపైన, పత్రిక (ఇంగ్లీషు / తెలుగు) ఏ భాషలో కావలెనో స్పష్టముగా పేర్కొనవలెను.

(ఎఫ్) చందాల రెన్యూవల్ కోరునప్పుడు, ప్రస్తుత చందాసంఖ్యను పేర్కొంటూ, రెండునెలలు ముందుగా పంపవలెను.

(జి) క్రొత్తగాచందాలు కట్టినవారికి చందా స్వీకరించిన రెండుమాసాల తర్వాత నుండి పత్రిక పంపగలం.

# తత్త్వమసి

"మణులలోపల సూత్రమేరీతిగా రాణించునో, అదేరీతిగా కనిపించే జగత్తులో ఆత్మరూపుని చైతన్యము కనబడని రీతిగా అంతటా ప్రకాశించుచుండును. ఈ హేతువుచేత విశ్వవిభుడు విశ్వమంతటా వ్యాపించియున్నాడు".

ప్రేమస్వరూపులారా!

"సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇది సమస్త ఉపనిషత్తుల సారం. ఈ సకల చరాచర ప్రపంచ మంతయు ఈ చిన్నపదమునందే ఇమిడి ఉంటున్నది. బ్రహ్మము కానటువంటిది ఈ జగత్తున ఎక్కడా కాన రాదు. "కట్టెలందున నిప్పులు కలిగినట్లు, తిలల యందున తైలంబు వెలయునట్లు- ఎందుచూచిన దైవంబు అందందే నిండియున్నాడు". కనుక దైవము కానిది ఈ జగత్తులో కానరాదు. దైవశాసనమును పురస్కరించుకొనియే సృష్టి స్థితి లయములు జరుగు చున్నవి. మానవుడు నమ్మిననూ, నమ్మకపోయిననూ ఈ జగత్తు అనే చక్రము "దైవశాసనము" చేతనే తిరుగుచున్నది. 'కాలచక్రమునకు కర్త దైవమే'. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు, చంద్రుడు తన చల్లద నాన్ని లోకానికి అందిస్తున్నాడు, వర్షములు కురియు చున్నవి, ప్రవాహములు ప్రవహించుచున్నవి, పంటలు పండుచున్నవి- ఈ కృత్యములన్నియూ ఏమానవునిచేత ఏర్పడుట లేదు అనే సత్యాన్ని ప్రతీవ్యక్తి గమనించు కొనుట అత్యవసరము. ఈ ప్రకృతియందు జన్మించిన ప్రతి మానవునికి దీనిని అనుభవించే సమాన మైన హక్కు ఉంటున్నది. ఇట్టి సత్యాన్ని మానవుడు విస్మరించినాడు.

## నిర్లిప్తభావం

మానవుడు సమత్వమును ఏనాడూ అర్థంచేసు కొనుటకు ప్రయత్నించుట లేదు. ఈ నిర్లిప్తమైన పవిత్రభావము పసిపాపలయందు మాత్రమే కనిపించు చున్నది. తల్లిపాలను త్రాగి, చల్లగాలిని పీల్చుకొని, కమ్మనికంఠంతో పాడే తల్లి జోలపాటలకు మురిసి పోయి, తన మనస్సును మైమరచిపోయి, మధురభావా లలో మునిగి-తేలే పరిస్థితి ఆ పసిపిల్లలయందు మాత్రమే కనిపించుచున్నది. కాని మానవుడు పెరుగు చున్నకొలది, "తన - పర" అనే భేదములు పుట్టు చున్నవి. నిస్స్వార్థం, త్యాగము రెండూ తరిగి పోవుచున్నవి. మానవత్వమే మరుగుపడుచున్నది.

దీనికి కారణము ఆత్మవిశ్వాసము కోల్పోవుటయే. సర్వత్రా ఉండిన శక్తి—"సర్వేశ్వర శక్తి" అనే తత్త్వాన్ని విస్మరించుటయే. తనయందు, తన వెలుపల, తనచుట్టూ సర్వకాల, సర్వావస్థలయందు, సర్వత్రా వ్యాపించియున్న దివ్యత్వాన్ని మానవుడు అర్థం చేసుకొనుటకు తగిన ప్రయత్నం చేయుటలేదు.

## ఆత్మవంతులు

జగత్తులో ధనవంతులు, బలవంతులు, గుణవంతులు, విద్యావంతులు కలరు. కాని ఆత్మవంతులు ఎక్కడా కనిపించుటలేదు. ఆత్మవంతుడనగా, "కనబడని ఆత్మను కనిపించేరీతిగా చేసుకొని, ఆనందములో తాను తన్మయుడై, ఉన్మత్తుడై దివ్యత్వమును అనుభవింపగలవాడు". ఇట్టి ఆత్మవంతులు ప్రాచీనకాలము నందు ఉండేవారు. అనేకమంది మహర్షులు, ఆత్మవంతులు ఈ దివ్యమైన భావాన్ని, ఈ దివ్యమైన రసాన్ని, ఈ దివ్యమైన శక్తిని తాము అనుభవించి, ఆనందించి జగత్తునకు అందిస్తూ వచ్చారు.

త్రికోణ స్వరూపాలు:—

### 1. శరీరం - మనస్సు - ఆత్మ

ప్రాకృతమైన మానవులకు ఈ పరతత్త్వమును బోధించే నిమిత్తమై, అనేక ఉపనిషత్తులందున్న భావములను క్రోడీకరించుకొని, వాటిని "త్రికోణ స్వరూపాలు"గా నిర్ధారణ గావించుకొని లోకానికి ప్రబోధిస్తూ వచ్చారు ఆనాటి మహర్షులు.

1. శరీరం 2. మనస్సు 3. ఆత్మ. శరీరం- స్థూలము, ఆత్మ- సూక్ష్మము. ఈ స్థూలమైన శరీరమునకు, సూక్ష్మమైన ఆత్మకు సమన్వయము గావించి, ఈ రెండింటిని కూర్చి - చేర్చి ఆనందింప చేయునది మనస్సు. ఈ మూడింటి సమన్వయము యొక్క ప్రతిపాదనే "తత్త్వం". ఈ తత్త్వమనే సత్యాన్ని మానవుడు సరిగా అర్థం చేసుకొనుట లేదు. తత్ + త్వం = తత్త్వం. 'తత్' అనగా 'అది', 'త్వం' అనగా 'ఇది'. మన ఇంద్రియములకు దూరంగా ఉన్నదానిని అది (That) అంటారు. మన ఇంద్రియములకు సమీపంగా ఉన్నదానిని ఇది (This) అంటారు. కనుక ఇంద్రియములకు సమీపముగా నున్నది దేహమే. మరి ఇంద్రియములకు దూరముగానున్న 'తత్' అనేదే ఆత్మ. దూరముగానున్న ఆత్మను, దగ్గరగానున్న దేహంతో "అసి" కలపటమే మనస్సు యొక్క స్వభావము. దీనినే "తత్ త్వం అసి" అని పిలుస్తూ వచ్చారు. కనుక మానవత్వంలో ఈ శరీరము, మనస్సు, ఆత్మ మూడింటి సమ్మిళిత స్వరూపాన్ని మనము గుర్తించటానికి ప్రయత్నించాలి. "తత్త్వమసి" అనగా ప్రత్యేకమైన అర్థము ఏమీలేదు. 'అది', 'ఇది' చేరినదే- "తత్త్వమసి" అనగా అతీతమైన ఆత్మను అనుభవరూపమైన దేహముతో ఏకత్వమును అనుభవించి, దివ్యత్వమును పొందటమే.

### 2. జీవుడు - దేవుడు - ప్రకృతి

జీవుడు - దేవుడు - ప్రకృతి ఈ మూడింటినీ కలిపి మరొక 'త్రికోణంగా' నిర్మించుకొన్నారు. ఈ మూడింటి సారాంశమును రక్తి, భుక్తి, ముక్తి అని కూడనూ ఏర్పరుచ్చుకుంటూ వచ్చారు. ఈ జగత్తే మనకు రక్తి, భుక్తి - ఈ దేహమునకు భుక్తి అత్యవసరము. ముక్తిస్వరూపుడే ఆత్మ. కనుక ప్రతి మానవునికి రక్తి- భుక్తి- ముక్తి అత్యవసరమని "తత్ త్వం అసి" బోధిస్తూవచ్చింది.

### 3. స్థూలము - సూక్ష్మము - కారణము

ఘనమైన ప్రకృతితత్త్వాన్ని స్థూల, సూక్ష్మ, కారణ రూపముల ద్వారా ఈ జగత్తునందు ఇముడ్చుకుంటూ వచ్చారు. ఇంతేకాక భూత, భవిష్యత్, వర్తమానములయందు అంతర్వాహినిగా ప్రవహించేది

"తత్త్వమసి" అని నిరూపించారు. కనుక మానవత్వములోపల ఈ "తత్త్వమసి" అనే దానిని ఎంత సులభముగా వారు గుర్తించి ప్రజలకు చాటిస్తూ వచ్చారు! నది ప్రవహించింది, ప్రవహించిన ఆ నది సముద్రములో చేరింది. సముద్ర జలము ఆవిరిగా మారింది. ఆవిరి మేఘంగా రూపొందింది. మేఘము వర్షంగా కురిసింది. వర్షము తిరిగి వాగువంకలుగా ప్రవహించాయి. ఈ వంకలు ఒక నదిగా రూపొందాయి. ఈ రూపొందిన నది తిరిగి సముద్రంలో చేరిపోయింది. కాని ఈ నది ఎక్కడినుండి వచ్చింది? ఈ నది నీరు ఎక్కడిది? అనే విషయం నదికి ఏమాత్రం తెలియదు. కాని చేరిన తరువాత "తత్త్వమసి" అవుతుంది. "మేము ఇందునుండే బయలుదేరినవారము. మేమిద్దరం ఒక్కటే" అని ఆ నది భావించుకొంటుంది. మరొక చిన్న ఉదాహరణ: ఒక విత్తనం భూమిలో నాటినాము. అది మొక్కరూపము ధరించింది. మొక్క వృక్షముగా రూపొందినది. ఈ వృక్షమునకే కొమ్మలు, రెమ్మలు, ఆకులు, కాయలు, ఫలములు కలిగినాయి. కాని ఈ కొమ్మలు, ఈ రెమ్మలు, ఈ ఆకులు, ఈ పువ్వులు, ఈ కాయలు, ఈ ఫలములు ఎక్కడినుండి వచ్చాయి? వీటి రూపనామముల రుచి ప్రభావములు వేరు వేరైనప్పటికిని, ఇవి-అవి చేరి ఒక్కటే అనే సత్యాన్ని నిరూపించుకొంటూ వచ్చాయి. ఈ విత్తనంలో ఉన్న అంశము "తత్త్వమసి" అని చెప్పుచున్నది. ఈ కొమ్మలు, ఈ రెమ్మలు, ఈ పువ్వులు, ఈ కాయలు, ఈ ఫలములు అన్నియు తననుంచి వచ్చినటువంటివే. కనుకనే ఈ విధమైన ఆధారమును పురస్కరించుకొని జగత్తంతయూ, "ఈశావాస్య మిదం జగత్" అని నిరూపిస్తూ వచ్చారు.

నీటిలో ఇంత చక్కెరను వేశాము. దానిని చక్కగా కలిపేటప్పటికి, ఆ చక్కెరంతా నీటిలో సర్వత్రా వ్యాపించిపోతుంది. కానీ, కంటికి కనిపించదు. చేతికి చిక్కదు. చక్కెర ఉన్నదా, లేదా అంటే, అరూపమై ఉంటున్నది, అగమ్యమై ఉంటుంది. కానీ, అది కేవలము జిహ్వకు మాత్రమే ఉండినట్లుగా గుర్తించటానికి వీలౌతుంది. గుర్తించినప్పుడు చక్కెర ఏమి చెప్పుతుంది? "తత్త్వమసి" అని తెలియజేస్తుంది. ఆ మాధుర్యము నాదే, ఆ మాధుర్యం నీటిది కాదు. ఈ విధముగా భగవంతుడు సర్వవ్యాపియై ఉన్నాడనే సత్యాన్ని ఆనాటి మహర్షులు ఇటువంటి చిన్న చిన్న వాక్యములచేత ప్రబోధములు చేస్తూ, ప్రచారములు గావిస్తూ "తత్త్వమసి" అనే ఏకత్వాన్ని ప్రబోధిస్తూ వచ్చారు. ఉన్నది ఒక్కటే అనేకత్వముగా రూపొందుచున్నది. అనేకత్వములో ఉన్న ఏకత్వమే భారతీయ సంస్కృతి ప్రభావమని ఉపనిషత్తులు చాటుతూ వచ్చాయి. కానీ, ఈనాడు ఏకత్వాన్ని విస్మరించి, అనేకత్వమును విశ్వసించి, మన జీవితమును వ్యర్థం చేసుకొంటున్నాము.

## ఓం కారం

'అ' కార, 'ఉ' కార, 'మ' కారముల మూడింటి యొక్క ఏకస్వరూపమే ఓం కారము. ఈ ఓంకారము యొక్క శబ్ద ప్రమాణమే ప్రణవము. ఈ ప్రణవమే ప్రపంచస్వరూపమునకు బీజం. కనుక ఓం కారమనే స్వరూపమే ఈ జగత్తు. ఇవి రెండూకూడా దివి నుండి భువివరకు, భువినుండి దివివరకు ప్రసారం జరుగుతూనే ఉంటాయి. ఈ రెండింటియొక్క ఏకత్వములోపల ఉన్న ఆత్మతత్త్వాన్ని గుర్తించడమే నిజమైన పురుషత్వమని ఉపనిషత్తు బోధిస్తూ వచ్చింది. ఈ ప్రణవశబ్దము అనేది ప్రతి మానవునియందు నిలిచి ఉంటున్నది. ప్రణవం మనకు ఎక్కడా కనిపించుటలేదే? వినిపించటంలేదే? అని మనం విచారించవచ్చును. మన ఉచ్ఛ్వాసనిశ్వాసములు, మన దేహమునందలి రక్తప్రసరణ మున్నగునవన్నీ ప్రణవమయమైనటువంటివి. చెట్టు గాలివీస్తున్నది. ఆ గాలియందు కూడా ప్రణవనాదం వినిపిస్తూ ఉంటుంది. ఒక ఎలక్ట్రిక్ స్తంభం వద్దనిలబడి నీ చెవిని ఆ పోల్ పైనపెట్టినప్పుడు 'ఓం'

అనే శబ్దమును మనము వినగలుగుచున్నాము. ఈ ప్రణవమునందు కేవలము కొన్ని కల్పితమైన వాటిని మనం కల్పించుకొనుటచేత అది ప్రణవంగా రూపొందటం మనము గుర్తించుటలేదు.

## సోఽహం

మన నిత్యజీవితములో ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరుగుచున్నాయి. మనము గాలిని పీల్చుకొను సమయములోపల 'సో' అని, విడుచులోపల 'హమ్' అని "సోఽహమ్" అగుచున్నది. ఈ రెండింటి ఏకత్వంలోపల నిజమైన "ఓం కారం" ఉంటున్నది. 'సో' అనే అక్షరంలోపల, 'హమ్' అనే అక్షరం లోపల ఉండినటువంటి అంతరార్థమును మనము గుర్తించుకొంటే, "సోఽహం" అదే నేను. అది కూడా "తత్ త్వం అసి". ఈ మూడు అక్షరములలో ఉండినటువంటిది ఏకాక్షరమని చెపుతున్నాము. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అనగా ఏకాక్షరం బ్రహ్మ. ఒకే అక్షరము అంటున్నామే? ఇది ఏవిధముగా ఒక అక్షరమవుతుంది. "సో...." ఇందులో సాలోక్య, సారూప్య, సామీప్య, సాయుజ్యములకు సంబంధించినటువంటి 'స' కారము మైనస్ అవుతుంది. ఎప్పుడీ 'స' కారం మైనస్ అవుతుంది? జాగ్రత్తను మరచి నిద్రావస్థలో నిలిచినప్పుడు. జాగ్రత్త యొక్క మంచి చెడ్డలను మనము విస్మరించినప్పుడు, ఈ 'సో' అనే శబ్దములోపల 'స' కారము మైనస్ అయిపోయి కేవలం "ఓ" అవుతుంది. 'హమ్' అనే నిశ్వాసం లోపల 'హ' కారం మైనస్ అవుతుంది. జాగ్రత్తలో ఉండినంతవరకే 'స' కార, 'హ' కారములు ఈ "ఓం" కారములో లీనమవుతూ ఉంటాయి. ఈ జాగ్రత్తను విస్మరించి గాఢనిద్రలో ఉండినప్పుడు ఈ 'స' కార, 'హ' కారములు రెండూ అంతర్థానమవుతాయి. కనుక 'సో' అనే అక్షరములో 'స' కారము పోయినప్పుడు 'ఓ' అవుతుంది. 'హమ్' అనే నిశ్వాసములోపల 'హ' కారము పోయినప్పుడు 'మ్' అవుతుంది. "ఓ + మ్ = ఓమ్" అయిపోయింది. స- కారము, హ- కారము రెండూ చేరినప్పుడు "సోఽహం" అయిపోయింది. ఈ 'స' కారం, 'హ' కారం రెండూ పోయినప్పుడు "ఓమ్" అవుతుంది. అనగా జాగ్రదావస్థలో ఉండినంతవరకు మానవుడు ఈ ప్రాకృతమైన జీవితంలో లీనమైపోయి తద్వారా "ఏకాక్షరం బ్రహ్మ" అనే సత్యాన్ని మరచిపోతున్నాడు.

## "ఉప - ని - షత్"

ఈ ప్రపంచం మన దృష్టిలో ఉండినంతవరకే మనకు సుఖదుఃఖములు. ఏనాడు నిద్రావస్థలో మనం ప్రవేశింతుమో అప్పుడే ఈ సుఖదుఃఖములు కూడా మరుగై పోతాయి. జాగ్రత్ ప్రపంచం మరుగైనప్పుడు మన సుఖదుఃఖములు మరుగైపోతాయి. దీనిని పురస్కరించుకొనియే "విదేహ సమాధిస్థితి" అన్నారు. ఈ నిద్రావస్థయందు ఏ విధమైన సుఖంకాని, దుఃఖం కాని, జగత్తుకాని మనకు కానరాక, అనుభవములోనికి రాక విడిచివెళ్ళుతాయి. కనుక మానవుడు దైవత్వాన్ని గుర్తించడానికి ఈ విధమైన మార్గాన్ని అనుసరించాలి. ఉపనిషత్తులు పెద్ద పెద్ద పదములుగా ఉండినదానిని చిన్న చిన్న వాక్యములుగా క్రోడీకరించుకొని, సామాన్యమైన మానవులకు నిత్యజీవితంలో అనుభూతికి, ఆనందమునకు, అనుగుణంగా రూపొందుతూ వచ్చాయి. "ఉప - ని - షత్" ఉప- అనగా సమీపం, ని- అనగా క్రింద, షత్- అనగా కూర్చో. అనగా గురువులను, పెద్దలను వినయంగా నీవు అనుసరించాలి అనేదే దీనిఅంతరార్థం. "దూరాత్ దూరే తదంతికే" అని చెప్పింది వేదం. నీకు భగవంతుడు ఎంత దూరం అని అనుకొంటున్నావో, అంత దూరముగా ఉంటున్నాడు, ఎంత సమీపుడని భావిస్తావో, అంత సమీపుడుగా ఉంటున్నాడు. ఈ దూరమునకు, సమీపమునకు నీ భావములే దోషం. కాని, ఏనాడూ భగవంతుడు దూరము కాదు, దగ్గర కాదు. సర్వత్రా ఉంటున్నాడు. అణువులో అణువుగా,

ఘనములో ఘనముగా ఉంటున్నాడు. కనుకనే— "అణోరణీయాం మహతో మహీయామ్" అన్నారు. ఇటువంటి దివ్యమైన తత్త్వాన్ని ప్రతి మానవుడు పరిశోధనచేసి, విచారణసల్పి, భక్తిశ్రద్ధలతో దానిని విచారణ చేయాలనుకొన్నప్పుడు, తప్పక దానిని అర్థం చేసుకొంటాడు.

ఈనాటి మానవుడు దివ్యత్వమును తెలిసికొనుటకు ఏమాత్రం ప్రయత్నించుట లేదు. ఈ అనిత్యం, అశాశ్వతం, అసత్యంతో కూడిన జగద్వ్యాపారముల యందు తమ సమస్తమును అంకితము గావిస్తున్నారు. కానీ నిత్యసత్యమైన, దివ్యమైన మార్గమునందు క్షణకాలమైననూ, అణుమాత్రమైననూ అంకితం చేయుట లేదు ఇదే మానవునియందు ఏర్పడిన అశ్రద్ధ. శ్రద్ధ కలిగినవానికే జ్ఞానం లభ్యమౌతుంది. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అన్నారు. శ్రద్ధ లేనప్పుడు ఏమాత్రం సమీపములో ఉండినదానిని కూడా మనం అనుభవించలేము.

## అరుణి - శ్వేతకేతుడు

నామముకంటే గొప్పది వాక్కు, వాక్కుకంటే గొప్పది మనస్సు, మనస్సుకంటే గొప్పది సంకల్పం, సంకల్పముకంటే గొప్పది చిత్తం, చిత్తముకంటే గొప్పది ధ్యానం, ధ్యానముకంటే గొప్పది జ్ఞానం, జ్ఞానంకంటే గొప్పది నీరు, నీరుకంటే గొప్పది తేజస్సు, తేజస్సుకంటే గొప్పది ప్రాణం. ఈ ప్రాణతత్త్వాన్ని అర్థము చేసుకొన్నప్పుడే, "తత్ త్వం అసి" అర్థమవుతుంది. ప్రాణతత్త్వమును మొట్టమొదట అర్థము చేసుకోవాలి. ఒక చిన్న ఉదాహరణ: పక్షదినములు మనము ఆహారము తీసుకొనక పోతే పదునైదు కళలు మనకు క్షీణించిపోతాయి. క్రమక్రమేణా మనము ఆహారము అధికముగా తీసుకొన్నప్పుడు మరల పదహారు కళలు మనలో ప్రవేశిస్తాయి. దీని అంతరార్థము ఏమిటనగా శరీరము అన్నమయము. కనుక అన్నమయమైన ఈ శరీరమునందు అన్నము క్షీణించితే ప్రాణశక్తి కూడా క్షీణిస్తుంది. శరీరం క్షీణించేది. క్షీణించనటువంటి ఆత్మ, క్షీణించే శరీరమునందు ఉన్నది. క్షీణించనటువంటి ఈ ఆత్మ నిరంతరం ప్రకాశిస్తూనే ఉంటుంది. అనాత్మ భావాన్ని మనము వదలిపెడితే మనకు ఆత్మసాక్షాత్కారమవుతుంది. నిత్యసత్యమైన ప్రాణతత్త్వాన్ని అర్థము చేసుకోవటానికి ప్రయత్నించమన్నాడు అరుణి. తన కుమారుడైన శ్వేతకేతునకు, "ఏది నిత్యమో, ఏది సత్యమో, ఏది తెలుసుకొంటే సర్వమూ తెలుసుకొన్నవాడౌతాడో, దేనిని చూచినప్పుడు సర్వమూ చూచినవాడవుతాడో, దానిని గుర్తించు నాయనా!" అని ప్రబోధించాడు. కనుక మానవుడు గుర్తించవలసినది ఒక్కటే. ఒక్కదానిని గుర్తించుకొంటే అన్నీ అందులో లీనమైపోతాయి. ఆ ఒక్కటి ఏమిటంటే, అదే ఆత్మతత్త్వం. ఈనాడు ఆత్మవిశ్వాసమును కోల్పోవుచున్నాము. ఆత్మకానటువంటి అనాత్మభావములన్నింటినీ మనము అనుసరిస్తున్నాము. మనం చేయవలసిన సాధనలు ధ్యానమా? యోగమా? జపమా? తపమా? యజ్ఞమా? యాగమా? క్రతువులా? ఇవి ఏవియూ కాదు. అనాత్మభావమును వదలిపెడితే ఆత్మసాక్షాత్కారమవుతుంది.

## అమనస్కం చేసుకోవాలి

మనస్సును మనము అమనస్కము చేసుకోవాలి. సంకల్పరహితమే అమనస్కము. కనుక సంకల్పములు క్రమక్రమేణా మనము తగ్గించుకొంటే తప్పక మనస్సుయొక్క ప్రభావం తగ్గిపోతుంది. కాని మనం ఆత్మవిశ్వాసమును అభివృద్ధి గావించుకోవాలనుకున్నప్పుడు, ఈ దేహ, మనో బుద్ధుల ప్రభావములన్నింటిని కూడా ఈ ఆత్మయందే లయం చేసుకుంటూ రావాలి. ఏ సంకల్పం వచ్చినప్పటికినీ, వాటినన్నింటినీ ఆత్మలో ప్రవేశపెట్టాలి. ఇదే సరియైన సాయుజ్యము. సాయుజ్యమనే తత్త్వం ఏకత్వములో మాత్రమే మనకు లభ్యమవుతుంది, అప్పుడు భిన్నత్వము శూన్యమౌతుంది

గోదావరి, కృష్ణ, యమున, కావేరి- ఇవన్నీ ప్రవహిస్తూ ఉంటాయి. ప్రవాహముల రూపములు వేరువేరుగా కనిపిస్తాయి. వీటియొక్క రుచులు కూడా వేరువేరుగా రూపొందుతాయి. అన్నియూ సముద్రములో చేరిన తరువాత ఈ సమస్తనదులన్నియూ తమ రూప. నామములను కోల్పోయి సముద్రముయొక్క రూప, నామ, రుచులనేపొందుతాయి. అదియే "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి". అందులో చేరినప్పుడు తానుకూడా ఆ రూపాన్ని ధరిస్తాడు. ఆత్మయందు సమస్త సంకల్పములు చేరినప్పుడు తాను ఆత్మగానే రూపొందుతాడు.

## దైవదృష్టి — లోకదృష్టి

ఆత్మకానిది, దైవముకానిది ఈ జగత్తులో మరొకటి లేదు. సర్వమూ దైవమైనప్పటికీ మనము దైవదృష్టితో చూడటం లేదు, లోకదృష్టితో చూస్తున్నాము. ప్రాకృత దృష్టిలో చూచినంతకాలము మనకు ఆత్మతత్త్వము అర్థమయ్యేది కాదు. ఒక చిన్న ఉదాహరణ ; ఈ టంబ్లరును ఆ రూపములో చూచినంతవరకూ అది టంబ్లరుగానే కనిపిస్తుంది. ఈ టంబ్లరు దేనితో చేయబడి ఉంటున్నది? వెండితో చేయబడినది. వెండి దృష్టితో చూచినప్పుడు ఆ టంబ్లరు మనకు గుర్తురాదు. తిరుపతికి వెళ్ళామనుకోండి, అక్కడ ఒకస్వరూపం మనకు కనిపిస్తుంది. స్వరూపమునందు దృష్టి ఉంచినంతవరకు ఆ స్వరూపము ఏ పదార్థముతో చేయబడిందనేది మనకేమాత్రము ఊహకు రాదు. దృశ్యముపైననే మనదృష్టి పడినప్పుడు అది కేవలము రూపమాత్రమే మనకు కనిపిస్తుంది. కాని ఆ రూపము దేనితో చేయబడినది? అని ఆలోచించినప్పుడు, దాని ఆధారభూతమైన రాయి కనిపిస్తుందేకాని, రూపము కనిపించదు. ఈనాడు రూపనామములతో కూడిన జగత్తుపైన మన దృష్టిని ప్రసరింపజేస్తున్నాము. కనుకనే మనకు మిద్దెలు, మేడలు, పుట్టలు, చెట్లు, వనములు, నదులు— అన్నీ కనిపిస్తున్నాయి. కానీ, అన్నింటికి ఆధారభూతమైన తత్త్వాన్ని గుర్తించినప్పుడివన్నీ ఏకత్వంగా రూపొందుతాయి. వృక్షము అంతా కాష్టమయము, పర్వతము అంతా రాతిమయము, భూమి అంతా మృణ్మయమయము, దేహము అంతా రక్తమయము. ఇవన్నీ పంచభూతముల స్వరూపములే. ఇవన్నీ ఆత్మయందున్న అంగములే. కనుక ఆత్మభావాన్ని చక్కగా అర్థము చేసుకుంటే, ఇవన్నీ సులభంగా అర్థమవుతాయి. ఎన్ని రకములైన ఆభరణములున్నప్పటికిని ఆధారభూతమైన బంగారము ఒక్కటే అన్నవిషయము మనము గమనించాలి. మహర్షులందరు కూడా ఏకత్వాన్ని ఈ విధముగా బోధిస్తూవచ్చారు, " శృంగారములు వేరుకాని బంగారమొక్కటే. పశువులవన్నెలు వేరుకాని పాలు ఒకటే. జీవజంతువులు వేరు వేరుగనుండునే కాని అందు నివసించు జీవుడు ఒక్కడే. జాతి నీతులు వేరు వేరుగా నుండునేకాని జన్మ ఒక్కటే. దర్శనంబులు వేరు వేరుగా కనిపించునేకాని దైవము ఒక్కడే. పూల జాతులు వేరు వేరుగా నుండునేకాని పూజలొకటే ". ఈ విషయాన్ని మానవులు తెలియక, తెలుసుకోలేక, తెలివితప్పి బ్రతుకు నిమిత్తము బహుబాధలకు బద్ధులైనారు. జీవనోపాధి నిమిత్తమై మన జీవితాన్ని ఛిన్నాభిన్నములు చేసుకొంటున్నాము.

## అవస్థలు మూడు - వ్యక్తి ఒక్కడే

జాగ్రదవస్థయందు మనం ఎన్నియో దృశ్యములంతా చూస్తున్నాము. ఎన్నియో అవస్థలను అనుభవిస్తున్నాము. కాని నిద్రావస్థలోనికి పోయినప్పుడు సమస్తపదార్థములను మనకు మనమే సృష్టించుకొంటున్నాము. తనకు తానే సృష్టించుకొంటాడు. కష్టసుఖములు కూడా తానే సృష్టించుకొంటాడు. జగత్తునంతా తానే సృష్టించుకొంటాడు. అందులో తాను బంధితుడవుతాడు. కాని పరిపూర్ణ సుషుప్తి అవస్థలో పోయేటప్పటికి అన్నింటినీ మరచిపోయి తాను నిశ్శబ్దంగా ఒకవిధమైన సమాధిస్థితిని పొందుతాడు. జాగ్రదావస్థలో అనుభవించినవాడు తానే. స్వప్నావస్థలో

సృష్టించుకొన్నవాడు తానే, సుషుప్తి అవస్థలో ఏకత్వమును పొందినవాడు తానే. అవస్థలు మూడుకాని వ్యక్తి ఒక్కడే. ఇదే "తత్త్వమసి". అనగా ఈ మూడు కాలములయందు, మూడు అవస్థలయందు, మూడు స్థితిగతులయందు అనుభవించిన వ్యక్తి ఒకడే.

## ఆధ్యాత్మిక జ్యోతులు

మానవత్వం అభివృద్ధి కావాలంటే, ఒక్క ఆధ్యాత్మిక వాతావరణమునందే అభివృద్ధి అవుతుంది. మానవత్వము కేవలము లౌకికమైన వాటియందు అభివృద్ధి కాదు. ధార్మిక, నైతిక, ఆధ్యాత్మికములందే ఈ మానవత్వం అభివృద్ధి గాంచుతుంది. కనుక ఈనాటి విద్యార్థులు అభివృద్ధి గావించుకోవలసినది మానవత్వం. కనుక ఈ అశాంతికి గురైన మానవులకు చక్కని మార్గమునుచూపే దీపికలే ఆధ్యాత్మిక జ్యోతులు. ఆధ్యాత్మికమనేది నశిస్తే భారతదేశమే నశిస్తుంది. భారతదేశమంతా ఆధ్యాత్మికముపై ఆధారపడి ఉన్నది. కనుకనే "ఇండియన్ కల్చర్ అండ్ స్పిరిచువాలిటీ" అన్నారు. Culture, Spirituality రెండూ వేరు కానేకాదు. నా ఉద్దేశ్యంలో స్పిరిచువాలిటీ ఒకటుంటే కల్చర్ అందులో లీనమైపోతుంది. స్పిరిచువాలిటీ ఉండినప్పుడు సమస్త ధర్మములు అందులో లీనమైపోతాయి. అదిలేక కేవలం Culture - Culture అంటే ఏమిటి? Culture అంటే సంస్కృతి. అనగా సంస్కరింపబడినటువంటిది. ఏ విధముగా సంస్కరింపబడింది? స్పిరిచువాలిటీ లేకపోతే సంస్కారమే లేదు. సంస్కారము లేనప్పుడు సంస్కృతియే లేదు. కనుక మొట్టమొదట సంస్కారం కావాలి. సంస్కార స్వరూపమైనటువంటిదే Spirituality. అదే ఆధ్యాత్మికము. అట్టి ఆధ్యాత్మికమనేది ఈనాడు మానవునియందు పూర్తిగా క్షీణించిపోయినది మన భారతీయ సంస్కృతి అట్టిది - ఇట్టిది అని వర్ణించుటకు వీలుకాదు. అన్ని జాతులవారు, అన్ని దేశీయులు, అన్ని వర్ణములవారు దీనిని ఎంతో వర్ణించుకొంటూ వచ్చారు. ఇందులో ముస్లింమతమునకు సంబంధించిన బాబరు భారతీయ సంస్కృతిపైన గొప్ప విశ్వాసము, గౌరవము కలిగి ఉండెను.

## బాబరు లేఖ

బాబర్ కుమారుడైన హుమాయున్ భారతదేశానికి రాజుగా వచ్చాడు. అతని తండ్రియైన బాబరు చాలా ఆనందించి తన కుమారునికి ఈ విధముగా ఒక పెద్ద లేఖ వ్రాసి పంపెనాడు. "హుమాయున్! నీవెంతటి అదృష్టవంతుడవోయి! నీవంటి అదృష్టవంతుడైన పుత్రుడు నాగర్భమునందు పుట్టుటవలననే ఎంత అదృష్టవంతుడనోయి! పవిత్రమైన సమస్త మతములను సమన్వయము కావించే భారతదేశానికి, అందులో అనేకత్వములోని ఏకత్వాన్ని నిరూపించే భారతదేశానికి, ముఖ్యముగా సర్వమత సారమైన భారతీయ మత తత్త్వానికి నీవు చక్రవర్తి కావటం చాలా అదృష్టము. కాని ఈ అదృష్టాన్ని నీవు నిలబెట్టుకోవాలి. భారతీయుల సంస్కృతికి నీవు ఏమాత్రము అడ్డుచెప్పవద్దు. అది మహాశక్తివంతమైనది. అంతేకాదు. మహాపవిత్రమైనది. అది సాధించలేనిది ఈ జగత్తులో మరొకటి లేదు. అట్టి భారతీయ సాంప్రదాయానికి నీవు ఏమాత్రమూ అడ్డుచెప్పకు. నీవు ఏ నిర్ణయాన్ని తీసుకుంటావో, ఆ నిర్ణయాన్ని నీవు ప్రకటించే ముందు, భారతీయులను సగౌరవముగా పిలిపించి వారితో సంప్రదించి, తగిన సలహానుపొంది, నీ కార్యక్రమాన్ని కొనసాగించుము". బాబరు మొగల్ సామ్రాజ్యాన్ని స్థాపించిన మహావీరుడు. అటువంటి బాబరే భారతీయుల సంస్కృతిని ఇంత గొప్పగా వర్ణించుకొని తన కుమారునికి పైరీతిగా లేఖ వ్రాయడము జరిగింది.

## నేనెప్పుడు తేడాలు చెప్పను

ఈనాటి భారతీయులు దురదృష్టవశాత్తు భారతీయ సంస్కృతిని పూర్తిగా ధ్వంసము చేసుకొంటున్నారు. ఇది ఎంత అవమానకరమైన విషయం! భారతీయులైన మీరు భారతీయ సంస్కృతిని చక్కగా అర్థం చేసుకొని, మనస్సునకు పట్టించుకొని, ఆ రీతిగా అనుసరించుకొని, కీర్తి ప్రతిష్ఠలను కాపాడుకొనుచూ ఆనందాన్ని అనుభవించాలని నేను ఆశిస్తున్నాను. ఇది గొప్పది, అది చిన్నది అని నేనెప్పుడు తేడాలు చెప్పను. అన్ని మతములు గొప్పవే. అన్ని మతముల రహస్యాలు చాలగొప్పవే. కాని మతముల పేరుతో ఈ సంస్కృతిని ఎవ్వరూ అనుసరించుట లేదు. ఇదే మానవునియందు ఏర్పడిన దోషము. మతతత్త్వాన్ని చక్కగా అర్థము చేసుకొని, దానిని అనుసరించి, దానికి తగిన కీర్తిని అందిస్తూ ఆనందాన్ని అనుభవించడానికి ప్రయత్నించాలి. ప్రతి మానవుడు గమ్యమును చేరడానికి అర్హుడే. కుల, మతములతో ఏమాత్రము సంబంధము లేదు. కాబట్టి మానవత్వం దివ్యత్వంగా మార్చుకోవటానికి ప్రయత్నించండి. దానవత్వంగా మార్చుకోకూడదు. సమస్త ఉపనిషత్తులు ఈ పవిత్రమైన ఏకత్వాన్ని ప్రబోధిస్తూ వచ్చాయి. ప్రతిమానవుడు ఈనాడు భోగమును అనుసరిస్తున్నాడేకాని, ఆశిస్తున్నాడేకాని త్యాగాన్ని ఏమాత్రం ఆశించుట లేదు, అనుసరించుట లేదు. త్యాగం అత్యవసరము. "నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః" అని వేదం చెప్పింది.

శ్రీవారి దివ్యబోధ
23—5—1991,
బృందావనం.

---

## సత్యసాయి మహితోక్తులు!

1) గీత దీనుని ధీరునిగా మారుస్తుంది. 2) కర్మ ధర్మమయం కావాలి; ధర్మం బ్రహ్మమయం కావాలి. 3) ప్రార్థన మాటల పరిశ్రమకాదు; హృదయంలోని దివ్యత్వాన్ని మేలుకొల్పాలనే తపన. 4) ప్రేమ అనే ఖడ్గాన్ని వివేకమనే ఒరలో ఉంచాలి. 5) యంత్రమధ్యమున పనిచేయుచున్ననూ, మీ జీవితం మంత్రమయం చేయాలి. 6) శాస్త్రజ్ఞులు యంత్రోపాసకులు, ఋషులు మంత్రోపాసకులు. 7) గుణములేని జీవితం చెల్లని నాణెం. 8) గుప్తంగా ఉన్న చిత్తమే చిత్రగుప్తుడు. 9) వేషమున కాషాయం హృదయమున కషాయం ఉండరాదు.

## త్రివిధ పుష్పములు

సర్వతీర్థ స్వరూపాయ । భక్తానాం హృద్గతాయచ ॥
సర్వదేవ స్వరూపాయ । సాయినాథ నమోస్తుతే ॥

అద్వైత భావనా సిద్ధ సాధుమానస శోధక ॥
అపారశక్తి సంపన్న । సాయినాథ నమోస్తుతే ॥

దీనార్తిహర సంసిద్ధ । హృదయంగమ రూపిణే ॥
సర్వాభీష్ట ప్రదాత్రేచ । సాయినాథ నమోస్తుతే ॥

—సచ్చిదానందస్వామి, జమ్మికుంట.

# త్యాగము వలన భోగము

సమస్తమును సృష్టించిన సృష్టికర్త సత్యస్వరూపుడు. అట్టి పరమాత్ముడు సమస్తసృష్టిని సత్యము నుండియే సృష్టించినాడు. ఆతని సమస్తసృష్టి సత్యమునందే లీనమై యున్నది. అందుచేత సమస్తసృష్టికీ సత్యమే ఆధారము. ఏ స్థలము పరికించిన సత్యస్వరూపమై, శుద్ధసత్వమై ఎందెందు చూచిన, అందందే గోచరించును. ఈ హేతువుచేత సత్యములేని తావేలేదు. ఈ జగమంతా సత్యమయం. కాబట్టి, అట్టి శుద్ధసత్వమైన సత్యస్వరూపమును పరికింపరయ్యా!"

ప్రేమస్వరూపులారా!

"ఏకం సత్. విప్రాఃబహుధావదంతి" సత్యం ఒక్కటైనప్పటికి దానికి ఋషులు అనేక నామములు చెపుతూ వచ్చారు. సత్యము ఏ ఒక్కరి సొత్తూ కాదు, అట్లే ఏ ఒక్క దేశమునకు, ఏ ఒక్క మతమునకు, ఏ ఒక్క కాలమునకు సంబంధించినది కాదు. దేశ, కాల, పాత్ర, మతములకతీతమైనది సత్యం. సమస్తమతస్థులు, సర్వ దేశస్థులు, అన్ని కాలములందున్నవారు ఈ సత్యమును అనుసరించుటలో సర్వాధికారమును కలిగియున్నారు. సత్యము ఎవ్వరినీ అనుసరించదు. ప్రతిమానవుడు సత్యమునే అనుసరించాలి. మానవపితామహుడైన మనువు ఇట్టి సత్యాన్ని యావత్ప్రపంచానికి బోధిస్తూ వచ్చాడు. మనువు నుండియే ఆవిర్భవించినవాడు కనుక మనుజుడని మానవునికి పేరువచ్చింది. మానవుడు సత్యవాక్య పరిపాలనకై ఆతని సర్వస్వము త్యాగము చేయవలసి యుండునని మనువు శాసనపూర్వకముగా తెల్పినాడు. దానినే "మనుశాసనము" అంటారు. కాని దేశ, కాల, పరిస్థితుల ప్రభావము పురస్కరించుకొని ఈనాడు దీనికి విరుద్ధమైన మార్గము కొనసాగుచున్నది.

## సత్యమార్గం — ప్రీతిమార్గం

"సత్యం జనవిరోధాయః అసత్యం జనరంజనం". ఈనాటి మానవునకు అసత్యం అంటే చాలా ప్రీతిగా, రుచిగా ఉంటోంది. సత్యాన్ని విరోధముగా భావిస్తున్నారు. ఈనాటి మానవుడు అన్నింటినీ తెలుసుకొంటున్నాడు, అందుకు ప్రయత్నిస్తున్నాడు. కాని సత్యాన్ని

తెలుసుకొనుటకు ప్రయత్నించుట లేదు. సత్యము వలననే సమస్త భోగములు, సమస్త భాగ్యములు లభిస్తున్నాయి. ప్రాచీనకాలమందు సత్యము వలననే రాజ్య పరిపాలన చేయగలుగుతూ వచ్చారు. సత్యమే శీలము, మతము, ప్రాణము, తపస్సు మరియు దైవం. ఇట్టి సత్యమును విస్మరించి అనిత్యమైన, అసత్యమును విశ్వసించి ప్రాకృతమైన మానవత్వమును కోల్పోవుటవలన మానవుని బలహీనత ప్రకటితమవుచున్నది.

మనువు మరొక విషయాన్ని కూడా జగత్తునకు తెల్పుతూ వచ్చాడు. "సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్, నబ్రూయాత్ సత్యమప్రియం" ఇతరులకు ప్రియం కదా! అని అసత్యమునుమాట్లాడ వద్దు. ఇతరులకు తాను చెప్పే సత్యము అప్రియమైనప్పుడు, అట్టిదానిని కఠినముగా చెప్పరాదు. ప్రతి మానవుడు సత్యమునే పలకాలి. ప్రీతికరమగు సత్యమునే పలకాలి. దీనినే భగవద్గీతయందు "అనుద్వేగ కరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్" అని చెప్పబడినది. ప్రీతిగను, హితముగను, అనుద్వేగముగను— చెప్పేవాక్యం ఉండాలి.

ఒక చిన్న ఉదాహరణ:- ఒక గ్రుడ్డివానిని చూచినపుడు నిజముగా ఆతనికి కన్నులు లేవు కదా యని "ఓ గ్రుడ్డివాడా!" అని పిలిచినచో అతని మనస్సు తప్పక నొచ్చుకుంటుంది. సత్యముగా ఆతడు గ్రుడ్డివాడే, అయినప్పటికి ఆ పదము వినగానే ఆతని మనస్సునకు ఎంతో బాధ కలుగుతుంది. పలికినమాట సత్యమే. కాని విన్న వ్యక్తికి అప్రీతిని కలిగిస్తుంది. మనము పలికినమాట సత్యమైనప్పటికి ఆతనికి బాధ కలుగనటువంటి వేరొక మార్గములో ఆతనిని పిల్చుట చాలా శ్రేయస్కరం. సత్యం-సత్యమని ఇతరులకు బాధ కలిగించే సత్యము ప్రవేశపెట్టరాదు. మానవుని నడతలు సక్రమమైనవిగా లేనప్పుడు ఆతడు తన వ్యక్తిత్వమునే కోల్పోతాడు. ఇటు మానవత్వం, అటు వ్యక్తిత్వం అభివృద్ధి కావలెనన్న మనం సత్యమార్గం, ప్రీతిమార్గం అనుసరించాలి.

## కర్మమార్గం — జ్ఞానమార్గం

సమస్త వేదములకు ఉపనిషత్తు శిరస్సువంటిది. ఉపనిషత్తులన్నింటిలో "ఈశావాస్యోపనిషత్తు" అగ్ర స్థానమునకు చెందినది. ఈశావాస్యోపనిషత్తు శుక్ల యజుర్వేదమునందు మంత్రరూపమై ఉంటున్నది. ఇది కర్మమార్గమును పురస్కరించుకొని 39వ అధ్యాయము వరకు ప్రబోధిస్తూ వచ్చింది. 40వ అధ్యాయము నుండి జ్ఞానమార్గమును ప్రబోధిస్తుంది. అక్కడ నుండియే ఈశావాస్యోపనిషత్ ప్రారంభమవుతుంది. కర్మను ప్రతిపాదించేది జ్ఞానం. జ్ఞానమునకు ఆధారము కర్మ. కర్మ, జ్ఞానములను సమన్వయం గావించేదే ఉపనిషత్తు. కనుక మానవుడు చేయవలసిన కర్మలు తప్పక చేసితీరాలి. మంచి కర్మలు మంచి మనస్సుతో ఆచరించాలి. "ఈ కర్మఫలితం నేనే అనుభవించాలి" అనే అభిమానమునకు మనస్సులో చోటివ్వకూడదు. "నేను చేయటంవల్లనే ఈ కర్మ యొక్క ఫలితము పొందగలిగాను" అనేటటువంటి అహంకారమునకు మానవుడు అవకాశము ఇవ్వకూడదు. ఈ అహంకారాభిమానములు మానవుని కర్మ బంధితుని గావిస్తాయి.

## త్యాగమార్గం — భోగమార్గం

మానవుడు ఏ భోగమును అనుభవించవలసి వచ్చినను త్యాగముచేత భోగమును అనుభవించమని ఈశావాస్యోపనిషత్తు తెలుపుతోంది. మానవునికి నిత్య జీవితములో త్యాగానికి, భోగానికి పొత్తుకుదరదు. త్యాగియైనవాడు భోగమును ఆశించలేడు. ఆ జోలికి కూడా పోడు. భోగియైనవాడు త్యాగి కాలేడు. అట్లే త్యాగాన్నిగూర్చి చింతింపడు. కనుక త్యాగముతో కూడిన భోగము అనుభవించుటకు సాధ్యము కాదు. ఈశావాస్యోపనిషత్తునందు ఈ సందర్భము పురస్కరించుకొని, ఈ విధంగా తెలుపబడింది. ఆచరణలోని

అహంకారమును, భోగానుభూతిలోని ఆసక్తిని రెండూ విసర్జించినప్పుడు త్యాగమునకు భోగమునకు ఎట్టి భేదము ఉండదు. కనుక అహంకార, ఆసక్తులతో కూడిన కర్మలు ఏమిచేసినప్పటికి అట్టి కర్మలన్నియు భోగములే.

ఈ అహంకార, అభిమానములు త్యజించినప్పుడు స్వార్థ, స్వప్రయోజనములు విసర్గములు. స్వార్థ, స్వప్రయోజనములులేని సర్వకర్మలు త్యాగముతో కూడిన భోగములే. కాబట్టి, ప్రతి మానవుడు స్వార్థరహితముగా, దైవ ప్రీతిగా, విధిగా కర్మలు ఆచరించి, ఇది తన ఆచరణకు ప్రతిఫలమనే అహంకారమునకు అవకాశము ఈయకూడదు. తాను చేసిన కర్మఫలితము కనుక దానిని తానే అనుభవించాలనే భావనకు అవకాశమీయరాదు. ఇదియే ఆత్మ తత్త్వమని ఈశావాస్యోపనిషత్తు ప్రబోధించినది. ఈ విధమైన అహంకారమును, అభిమానమును త్యాగముగావించి, అనుభవించే భోగమే నిజమైన యోగము అని నిరూపిస్తూ వచ్చింది.

## యోగ క్షేమాలు

యోగమనగా అనేక సాధనలచేత సాధించుకొన్నట్టి దివ్యమైన సంపుటి. దీనినే భగవద్గీతయందు కృష్ణపరమాత్ముడు "యోగక్షేమం వహామ్యహం" అన్నాడు. "నీ యోగక్షేమములను నేను చూచుకుంటాను" అన్నాడు. యోగక్షేమములనగా ప్రాకృతమైనట్టి దృష్టితో విచారించినప్పుడు మన క్షేమసమాచారములు, మన ఇల్లువాకిలి, మన ఆలుబిడ్డల పరిస్థితులు ప్రశ్నించుకోవటం అని భావిస్తున్నాము. ఈ ప్రాకృతమైన విచారణకు యోగమనే పేరు సార్థకము కాదు. మానవుడై పుట్టి, మానవాతీతమైన అనేక సాధనలచేత దివ్యత్వాన్ని సాధించి, దానిని వశము చేసుకొన్న పవిత్రమైన స్థితికి యోగమని పేరు. అనగా అప్రాప్తమైన దివ్యత్వమును ప్రాప్తించుకొనుటయే మహత్తర యోగము. అగోచరమైన, దివ్యమైన తత్త్వాన్ని గోచరింపచేసికొనుటయే యోగం. కంటికి కనిపించని, చెవులకు వినిపించని, మనస్సునకు అనిపించని, హృదయాన్ని కరిగించే దివ్యమైన స్థాయిలో దివ్యత్వముతో కూడిన తత్త్వమును అనుభూతికి తెచ్చుకొనుటయే యోగము. అవ్యక్తమై గాఢముగా ఉన్నట్టి తత్త్వ రహస్యాన్ని వ్యక్తీకరింప చేసుకొనుటయే యోగము

సమస్త సాధనలచేత సంపాదించుకొన్న దివ్యత్వమైన యోగాన్ని రక్షించుకొనుటయే క్షేమము. కాబట్టి మానవాతీతమైన, ఊహాతీతమైన దివ్యత్వాన్ని సంపాదించుకోవటం, ఆ సంపాదించుకొన్నటువంటి దివ్యత్వాన్ని కాపాడుకొనుటయే యోగ క్షేమములనే పదములకు అంతరార్థం. ఈ యోగ క్షేమాలతో కూడిన దివ్యత్వానికే త్యాగముతో కూడిన భోగమని చెప్పవచ్చు. అందుచేత త్యాగముతో కూడిన యోగము మానవత్వానికి అత్యవసరము. ఇట్టి త్యాగమునకు పూనుకొన్న మానవత్వములోనే దివ్యత్వమైన వ్యక్తిత్వము ఆవిర్భవిస్తుంది. కాబట్టి ప్రతిమానవుడు ఉపనిషద్వాక్యములను త్యజీకరించక, దివ్యమైన భావంచేత క్రోడీకరింపజేసుకొని దానిని నిత్యాచరణలో ఉంచుకొనుటకు తగిన కృషిచెయ్యాలి.

## అంతఃకరణ పరిశుద్ధము చేసుకో

మానవుడు కేవలము శారీరక, మానసిక, ఆధ్యాత్మికతత్త్వములతో కూడినవాడు మాత్రమే కాదు ఇతనికి అతీతమైన ప్రజ్ఞాశక్తి ఒకటున్నది. దానినే 'ప్రజ్ఞ' అన్నారు. ప్రతి మానవుడు ఈ ప్రజ్ఞాశక్తిని దృష్టియందు పెట్టుకోవాలి. మనస్సునందు, శరీరమునందు, అంతఃకరణయందు ఈ ప్రజ్ఞాశక్తి అంతటా సర్వవ్యాపకమై యున్నది. అంతఃకరణమనగా ఏమిటి? అంతఃకరణమనగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము. ఈ నాల్గింటియొక్క సమ్మిళితమైన సంపుటియే అంతఃకరణ అంటారు. ఇక్కడ మనస్సు అనగా ఏమిటి? నిరంతరము మననం చేసుకొనుట, చింతించుటయే మనస్సు. "సంకల్ప వికల్పకాత్మ

కమ్ మనః". ఇది ఒక వస్త్రము. ఈ వస్త్రమునకు పడుగు, పేక అనగా నిలువు, అడ్డము అనే దారములు చేరి ఉంటున్నాయి. ఇదియే సంకల్ప వికల్పాత్మకమైనది. మనం ఒకవైపున ఉన్న దారములను తీసివేస్తూ వస్తే బట్టలేదు. అదే విధముగనే ఈ సంకల్పములనే దారములను మనం తీసివేస్తూవస్తే, మనస్సనే స్వరూపముండదు. దీనినే మనన, త్రాణ సమ్మిళితమన్నారు. ఈ సంకల్పములచేత మనన, త్రాణశక్తిని మనము పెంచుకొంటున్నాము. మనస్సు సంకల్పములతో కూడిన స్వరూపము.

చిత్తము అనగా చింతించటమే. తద్భావాన్ని మనం చింతించటమే. బుద్ధి అనగా నిర్ణయాత్మకశక్తి. నిత్యానిత్య పరిశీలనచేసే దివ్యమైనతెలివి. ఇంక నాల్గవది అహంకారము. అహంకారమనగా ఆకారమునే పురస్కరించుకొని 'నేను' అని భావించుకోవటమే. అహంకారము = అహం + ఆకారము. అహంకారము, మనస్సు, బుద్ధి, చిత్తము ఈ నాలుగు ఒకే మనఃపరిణామములే. మనస్సే ఇన్ని రూపములను ధరిస్తూ ఉంటున్నది. ఒకే మనస్సునే ఇన్ని పేర్లతో సంబోధిస్తూ వస్తున్నాము. ఒక బ్రాహ్మణుడు వంట చేస్తూ ఉంటే ఆతనిని 'వంటబ్రాహ్మణుడు' అంటాము. అదే బ్రాహ్మణుడు పూజచేస్తే 'పూజారిబ్రాహ్మణుడు' అంటాము. ఇక్కడ బ్రాహ్మణుడు ఒక్కడేః అయినప్పటికిని ఆతని వృత్తిని పురస్కరించుకొని ఆతనికి ఈ విధమైన పేర్లు వేరు వేరుగా చెప్పడము జరుగుతుంది. కనుక మనస్సు అనేక వృత్తులతో కూడినప్పుడు దీనికే బుద్ధి, చిత్తము, అహంకారము, మనస్సు అని పేర్లు వస్తున్నాయి. ఇవన్నీ మనస్సు యొక్క పర్యాయపదములు.

అంతఃకరణ అని ప్రత్యేకంగా లేదు. మన కరణములన్నియు బయటకు కనిపిస్తున్నాయి. కన్ను బయటకు చూస్తుంది, చెవి బయట విషయాన్ని వింటుంది, ముక్కు బయటిగాలిని పీలుస్తుంది. కన్ను, చెవి, ముక్కు మొదలగునవి బహిఃకరణములు. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అంతఃకరణములు. ఇవిలోపల ఉండిన పనిముట్లు. కనుకనే వీటికి అంతఃకరణములని పేర్లు వచ్చాయి. అంతఃకరణ పరిశుద్ధి లేకుండా బహిఃకరణములతో మనము అనుభవించినది ప్రతిఒక్కటి లౌకికభోగము అవుతుంది. కనుక మొట్టమొదట అంతఃకరణములను పరిశుద్ధము గావించుకోవాలి. అంతఃకరణ పరిశుద్ధితో బహిఃకరణములు ఏది చేసినప్పటికీ త్యాగమవుతుంది.

## సత్కర్మలాచరించు

ప్రతి మానవుడు కర్మాచరణకు కంకణం కట్టుకోవాలి. కర్మలేక చిత్తమునకు శుద్ధికలుగదు. కనుకనే వేదములందు "చిత్తస్య శుద్ధయే కర్మః" అన్నారు. చిత్తశుద్ధి నిమిత్తమై సత్కర్మలాచరించాలి. సత్కర్మలనగా ప్రతిఫలాపేక్ష లేకుండా, స్వార్థం లేకుండా కర్మలాచరించడమే. దానినే నిష్కామకర్మ అన్నారు. ఈ నిష్కామకర్మకే భోగముతో కూడిన త్యాగమని పేరుపెట్టారు. ఈ విధమైన భోగముతో కూడిన త్యాగమును ఈశావాస్యోపనిషత్తు అనేక విధములుగా బోధిస్తూ వచ్చింది. ప్రతివ్యక్తి అకర్ముడు కాకూడదు. కాయము కర్మ నిమిత్తము ఆవిర్భవించింది, కర్మ కాలాన్ని పవిత్రం గావిస్తుంది. కాలము ఒక విధమైన కర్తవ్యముతో కూడినది. కాల, కర్మ, కారణ, కర్తవ్యము యొక్క జీవితమే మానవుని ప్రధాన లక్ష్యము. మనము మానవత్వాన్ని నిరంతరం, స్వార్థ స్వప్రయోజనముల కోసమే ప్రవేశ పెడుతున్నాము. ఇంక త్యాగంతో కూడిన భోగం ఏరీతిగా లభిస్తుంది? కేవలం భోగంతో కూడిన రోగంగా రూపొందుతుంది. కాబట్టి మానవుడు యోగికావాలికాని, భోగికాకూడదు.

## రోగము - యోగము

భోగమనగా కేవలము నిద్రాభయములతో, సంతానోత్పత్తితో జీవితమును వ్యర్థము గావించుకోవటమా? దేహమును కాపాడుకొనే నిమిత్తము ఆహారము అత్యంత అవసరమే. భిక్షాన్నము దేహ

రక్షణార్థం, వస్త్రం మాన రక్షణార్థం, మానవజీవిత మంతయు రోగములతో కూడిఉంటున్నది. ఓ మనసా! మానవ శరీరం మలినపుకొంప, భవసాగర మీదగలేని కంప. ఇట్టి దేహము నిశ్చలమని నమ్మ వద్దు, కాబట్టి హరి పాదములాశ్రయించుట ముఖ్యము. అంతేకాదు, ఈ దేహము కుళ్ళిపోయే దుంప వంటిది, కూలిపోయే రథము వంటిది. ఇట్టి శరీరరోగమును నివారించుటకై ఔషధము సేవించాలి. ఏది రోగము? ఏది ఆరోగ్యము? అన్ని రోగములలో ఆకలి ఒక రోగము, దానికి అన్నము ఔషధము. దాహమనే రోగమునకు నీరు ఔషధము. ఈ రీతిగా ఒక్కొక్క ఔషధము సేవిస్తూ ఉంటున్నాము.

ఆనందము కావాలని కోరేది ఒక రోగము. ఆనందమునకు కార్యాచరణ ఔషధము. ఆనందము కావాలని ఆశిస్తూ, దానికి తగిన కృషిని మనము చేయ లేక పోయినప్పుడు ఆనందమేరీతిగా లభ్యమవుతుంది? ఆనందము తన స్వరూపమే అయినప్పటికి దానిని అనుభవించడానికి మానవుని ప్రయత్నము అత్యావ సరము. చేతితో కర్మనాచరించాలి, నోటితో దివ్యమైన నామము స్మరించాలి. ఈ రెండింటి పరిశ్రమ ద్వారానే మనకు ఆనందము ప్రాప్తిస్తుంది. కనుక మానవులకు రోగము కానటువంటిది ఈ జగత్తులో ఏ ఒక్కటి కూడా లేదు. మనము ఆ రోగమును, యోగముగా మార్చు కొనే కృషిని చెయ్యాలి. కనుకనే దీనికి శాస్త్రములన్ని ఈరీతిగా చెబుతున్నాయి: దినమునకొక పర్యాయము భుజించినవాడు-యోగి, రెండు పర్యాయములు భుజిం చినవాడు-భోగి, మూడు పర్యాయములు భుజించిన వాడు-రోగి, నాలుగు పర్యాయములు భుజించిన వాడు-బ్రతికిచచ్చినవానితో సమానుడు. ఇట్టివానిని "జీవన్మృతుడు" అంటారు. కనుక నిరంతరం పొట్ట నింపుకొనే నిమిత్తమై ప్రాకులాడుతున్నామేకాని జీవితాన్ని సుఖశాంతులతో, దివ్యమైనమార్గంలో ఆదర్శవంతమైన జీవితాన్ని పొందుటకు మనము కృషి చేయుట లేదు.

## ఒకటి జ్ఞప్తికి పెట్టుకో-రెండింటిని మరచిపో

విద్యార్థులారా! సమస్త పదార్థములు కాలాను గుణ్యముగా నశించునవే. కాల, కర్మ, కారణ, కర్తవ్య ములు కలసివచ్చినప్పుడు కాయము వదలవలసి వస్తుంది. కాని కాయము మరణించినప్పటికీ ఆదర్శము శాశ్వత ముగా. చిరస్థాయిగా ఉంటుంది. ఈ మాట సత్యము, ఇదే చిరంజీవత్వము, ఇదే చిరంజీవితత్త్వము. అట్టి ఆదర్శమునందించే వ్యక్తిగా మనం తయారు కావాలి. తరతరముల వరకు అట్టి ఆదర్శము ప్రజల హృద యాలలో శాశ్వతముగా నిలచియుంటుంది. ఆశలు మనకు ఉండవలసినదే కాని, ఆశలకు ఒక పరిమితం పెట్టుకోవాలి. సమాజమును దృష్టిలో పెట్టుకొని, కర్తవ్య, కర్మలు ఆచరించడానికి ప్రయత్నించడమే త్యాగమునకు తగిన భోగం. పరోపకారం నిమిత్తమై ఎదుటివారి పనులలో మనము ప్రవేశించినప్పుడు మనకు కలిగే ఆనందము ఇంతా, అంతా అని చెప్పుటకు వీలు కాదు, చెప్పలేముకూడ. అటువంటి త్యాగముచేతనే ఇటువంటి ఆనందమనే భోగమును మనము అనుభ వింప గలుగుచున్నాము. ప్రతిఫలాపేక్షతో మనము కర్మలు ఆచరించినప్పుడు మనకు ఆనందము కలుగదు. ప్రపంచములో మనము జ్ఞప్తియందు పెట్టుకొనవలసి నది ఒకటి, మరువ వలసినవి రెండు. ఈ మూడింటిని మనము సాధిస్తే, త్యాగముతో కూడిన భోగమై పోతుంది.

ఒకటి జ్ఞప్తికి పెట్టుకో: ఇతరులు మనకు చేసిన ఉపకారమును జ్ఞప్తియందుంచుకొనవలెను. మనము పొందిన ఉపకారమును మరచిపోయినచో కృతఘ్నులమగుదుము, కాబట్టి ప్రతి వ్యక్తి ఈ ఒక్కటి జ్ఞప్తికి పెట్టుకోవాలి.

రెండింటిని మరచిపో: మనము ఇతరు లకు చేసిన ఉపకారము మరచిపోవాలి. అట్లు మరువ కుండా మనహృదయంలో పెట్టుకొన్నప్పుడు మనము చేసిన ఉపకారమునకు తగిన ప్రతిఫలం

ఆశించడం జరుగుతుంది. ఇట్టి విషయానికే "ప్రతిఫలాపేక్ష" అని చెపుతారు. దానివలన మనసు కొంత నిరాశ, నిస్పృహలకు గురికావలసి వస్తుంది. ఈ నిరాశ అసూయాద్వేషములకు దారి తీస్తుంది. కాబట్టి మనం చేసిన ఉపకారమును అప్పటికప్పుడే మనము మరచిపోవాలి. ఇతరులు మనకు చేసిన అపకారమును మరచిపోవాలి. లేనిచో దానికి ప్రతి అపకారము ను చేయాలనే దుర్బుద్ధి మనలో ప్రవేశిస్తుంది. ఇటువంటి దుర్భావములు ఆవిర్భవించకుండా ఉండటానికి ఇతరులు మనకు చేసిన అపకారమును అప్పటికప్పుడే మరచిపోవాలి. మనము ఇతరులకు చేసిన ఉపకారము, ఇతరులు మనకు చేసిన అపకారము రెండింటిని మరచిపోవుటయే త్యాగముతో కూడిన భోగమై పోతుంది. ఆరీతిగా కాకుండా, మనం చేసిన ఉపకారాన్ని, పరులు చేసిన అపకారాన్ని నిరంతరం స్మరిస్తూ ఉంటే, మన జీవితం "మలినపుకొంప"గా తయారౌతుంది. అంతేకాదు, మనదేహం ఒక దుర్గంధముతో కూడిన దిబ్బవలె రూపొందుతుంది. మనము దేనిని చింతిస్తామో దాని Reaction మనకే లభిస్తుంది.

## విశ్వాసము నాల్గువిధాలు

భారతీయ సాంప్రదాయమునందు కర్మఫలము తప్పినదికాదు. అనగా కర్మఫలమును అనుభవించి తీరవలెను. 1. కర్మఫల త్యాగం, 2. అవతార తత్త్వముపై విశ్వాసం, 3. ప్రతిఫలానుభవం, 4. పవిత్రతపై విశ్వాసం - పవిత్రతపై విశ్వాసమనగా ఈ జగత్తులో మనము ప్రతి విషయమునందు కొన్ని రకములైన పవిత్రతాభావనగూర్చి ప్రగాఢమైన విశ్వాసం కలిగి యుంటాము. ప్రతిఫలానుభవం అనగా మనం ఏది చేసినప్పటికి దాని ప్రతిఫలము అనుభవింపక తప్పదని అర్థము.

పై నాల్గు విషయాలను పవిత్రత, ప్రశాంతత, పట్టుదల కలిగియున్నచో సాధింపగలము. కనుక విద్యార్థులైన యువకులు ఇప్పటినుండే పవిత్రమైన మార్గంలో ప్రవేశించి, త్యాగముతో కూడిన భోగములు అనుభవించడానికి ప్రయత్నించాలి. రోగముతో కూడిన భోగములు మనము ఆశించరాదు. త్యాగమే మనకు నిజమైన భోగము. విద్యాధనము సంపాదించిన తరువాత ఆ విద్యాధనము ఇతరులకు బోధించే పరిశ్రమలో మీ శక్తిని, జ్ఞానమును త్యాగం చేయాలి. తద్వారా మీ విద్యలు కూడా మరింత అభివృద్ధి అవుతాయి. ఎవరికో మీరు ఉపకారము చేస్తున్నారని భావించవద్దు, మనకు మనమే ఉపకారము చేసుకుంటున్నామని భావించండి.

## ఉదయాస్తమయాలు

విద్యార్థులారా! మీ జీవితం పెరగడం మాత్రమే మీరు చూచుకొంటున్నారు. ఈ జీవితంలో తరిగే తత్త్వన్ని గూర్చి మనము విచారించుట లేదు. మన జీవితం ఆయువుతో కూడి ఉంటుంది. మన దేహం ఎంత పెరుగుతూ వస్తుందో, ఆయుర్దాయం కూడా అంతంత తరుగుతూ వస్తుంది. ప్రతిరోజూ సూర్యోదయ, సూర్యాస్తమయ సమయముల గురించి మనము ఎంతగానో ఆనందిస్తుంటాము. ప్రతీ వ్యక్తి సూర్యోదయం కాగానే "ఆహా! సూర్యుడు ఉదయించినాడు, వెలుతురు ప్రసరించినది. మన పనులను ప్రారంభించుకోవచ్చు" అని ఆనందిస్తాడు. కాని సూర్యుడు అస్తమించగానే "ఆహా! ఇంక ప్రశాంతముగా గురకలు పెట్టి నిద్రపోవచ్చు" అని తలుస్తాము. అంతేకాదు దేహానికి సరియైన విశ్రాంతి నీయవచ్చునని భావిస్తాము, సంతోషిస్తాము.

ఈ భావనలన్నీ కేవలం అజ్ఞానజనిత ప్రభావములే. సూర్యోదయ, సూర్యాస్తమయముల చేత మనం ఎంతగా ఆనందిస్తామో, అంతంతగా ఈ రెండింటి వలన మన ఆయుఃప్రమాణము తరిగిపోతున్నదని యోచించుటలేదు, విచారించుటలేదు. కేవలం వినోదిస్తున్నాం. ఇది చాలా పొరపాటు కాబట్టి ప్రతి మానవుడు సూర్యోదయ, సూర్యాస్తమయ సమ

యాలకు పూర్వమే తన కర్తవ్యకర్మలను నిర్వర్తించుకోవాలి. రామకృష్ణ పరమహంస కూడా తెల్లవారినది మొదలుకొని రాత్రి పరుండువరకు ఆ కాళికా మాత దివ్యదర్శన ప్రాప్తి సంప్రాప్తము కాలేదే! అని చాల బాధపడేవాడు.

ఒక్క రోజు కాళికామాత కనిపించక పోయినచో "అయ్యో! ఈనాడు వ్యర్థమై పోయినదే! కాళికా మాత కనిపించలేదే!" అని పరితాప విచారములతో పవళించేవాడు. కనుక ఒక్కొక్క దినమును ఒక్కొక్క క్షణముగా భావించుకొని ఆ దివ్యమైన అనుభూతి కోసమై అనేక రకాలుగా మానసిక బాధలు పొందటం జరిగింది. ఆనాటి మహర్షులందరు ఇటువంటి తాపత్రయమే తపస్సుగా మార్చుకొని దివ్యమైన ఆత్మతత్త్వమును అనుభవములోనికి తెచ్చుకొని ఆనందిస్తూ వచ్చారు.

## త్రికరణశుద్ధి - తపస్సు

తపస్సు అనగా కేవలం తల క్రిందకుపెట్టి కాళ్ళు పైకిపెట్టి ఏదో ఒక విధమైన దీక్షను పూనుకోవటం కాదు; త్రికరణశుద్ధి. అనగా మనోవాక్కాయకర్మలను ఏకంగా భావించుకోవటమే తపస్సు. ఈవిధానమే మహాత్ముల ప్రభావము. "మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం మహాత్మనాం; మనస్యన్యత్, వచస్యన్యత్ కర్మణ్ అన్యత్ దురాత్మనాం" మనస్సులో ఒకటి మాటలో మరొకటి, క్రియలో ఇంకొకటి - ఈ విధముగా నడచుకొన్నచో అట్టివారి తపస్సు ఏ మాత్రము తపస్సుగాదు, అది తమస్సుగా మారిపోతుంది. మానవత్వం విలువైనది, పవిత్రమైనది, ఆనందించదగినది, అనుభవించ దగినది.

"జంతూనాం నరజన్మ దుర్లభం" అన్నారు. దుర్లభమైన నరజన్మను సులభముగ పొంది దానిని అప్రాప్త రూపమైన ప్రాప్తిలో అనుభవించాలి కాని దుష్టమార్గములో మనము సంచరించి వ్యర్థము చేయకూడదు. లోక సంబంధమైన విద్యలన్నీ అభ్యసించుటలో తప్పులేదు. కాని దివ్యమైన మార్గాన్ని కొంత వరకు చిత్తములో పెట్టుకొని దాని ప్రకారము నడచుకొని జీవించుట చాలా ముఖ్యము. మనము యోగులమే కాని రోగులము, భోగులము కానే కాదు. ప్రతి మానవుడు యోగి, భోగి, జోగి, విరాగి, బైరాగి మున్నగు తత్త్వములందు దివ్యమైన త్యాగభావము మాత్రమే సమత్వముగా సరిచూచుకోవాలి. కనుక ప్రతి మానవునికి త్యాగము ప్రధానమైన గుణము.

## న సుఖాత్ లభతే సుఖం

ఉపనిషత్తులు ఇంతటి ఘనమైన విషయాలను ఎంతో సులభంగా అందిస్తూ వస్తున్నాయి. అశాంతిలోని ప్రశాంతి, ప్రశాంతిలో ప్రకాంతి, ప్రకాంతిలోని పరంజ్యోతి, పరంజ్యోతిలోని పరమాత్మ తత్త్వము మహర్షులు చాలా చక్కగా, క్రమంగా లోకానికి తెలుపుతూ వచ్చారు. చీకటి లేకపోతే కాంతికి విలువలేదు, ఆకలి లేకపోతే అన్నానికి విలువ లేదు, వేడి లేకపోతే ఎయిర్ కండిషన్‌ని ఎవరూ ఆశించరు. కనుక దీనిని పురస్కరించుకొని, "నసుఖాత్ లభతే సుఖం" సుఖంచేత మనకు సుఖము లభించదు; కష్టము చేత, దుఃఖముచేత సుఖము మనకు ప్రాప్తిస్తుంది. ఇరువది నాల్గుగంటలు ఎయిర్ కండిషన్ రూమ్‌లో కూర్చుంటే, ఎయిర్ కండిషన్ విలువను ఎవ్వరూ లెక్కచేయరు. రెండు గంటలు ఎండలోనికి పోయి వచ్చి, తిరిగి ఎయిర్ కండిషన్ రూమ్‌లో కూర్చున్నప్పుడు దాని విలువ మనకు అర్థమవుతుంది. కాబట్టి మానవ జీవితం సుఖదుఃఖాలతో కూడిన విచిత్రమైన చరిత్ర. లాభనష్టములతో, శీతోష్ణములతో కూడిన జీవితమగుటవలన ఈ రెండు భావములు లేకపోతే, ద్వైతమే లేకపోతే అద్వైతానికి విలువ లేనట్లుగా ఉంటుంది.

"పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణముదచ్యతే.
పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమేవా వశిష్యతే."

పరిపూర్ణమైన పెద్ద వృత్తము (Circle), దీని లోపల ఒక చిన్న వృత్తము ఉన్నది. ఆ చిన్న వృత్తములోపల మరింత చిన్న వృత్తము కలదు. అనగా పెద్ద వృత్తము, చిన్న వృత్తము, అతి చిన్న వృత్తము అని గుర్తింపవలెను. అతిచిన్న వృత్తమే దేహము, దానికంటే పెద్ద వృత్తమే మనస్సు (Mind), అన్నింటికన్నా పెద్ద వృత్తమే ఆత్మ. ఈ ఆత్మ ఏనాటికీ మారదు. ఈ అతి చిన్న వృత్తముగా పేర్కొన్న దేహము ఆత్మ తత్త్వాన్ని అందుకోవాలి. ఈ అతి చిన్న వృత్తమును విశాలం చేసుకుంటూ మధ్య వృత్తములో ప్రవేశించాలి. అనగా మనస్సుతో మనము కలవాలి. ఈ మనస్సును కూడా విశాలపరచుకొని ఆత్మలో ఐక్యము(Merge) కావాలి. అప్పుడే అన్నింటి ఏకత్వము ప్రాప్తిస్తుంది.

## మనదేహమే ఒక పెద్ద గడియారం

ఒక చిన్న ఉదాహరణ: ఒక గోడ గడియారం ఉన్నది. దానిని Wall Clock అంటారు. ఆ గడియారములో మూడు ముళ్ళు ఉంటాయి. 1వది సెకండ్ల ముల్లు, 2వది నిమిషముల ముల్లు, 3వది గంటల ముల్లు. ఈ మూడింటిలో మనకు ఏది ప్రధానము? గంటల ముల్లు లేకుండా సెకండు ముల్లు ఉన్నా ప్రయోజనము లేదు; నిమిషాల ముల్లు లేకుండా గంటల ముల్లు ఉన్నా ప్రయోజనంలేదు. ఈ మూడు ముళ్ళుకూడ అవసరమే. సెకండ్స్ ముల్లు 60 ఇండ్లు ప్రయాణం చేస్తూ వస్తుంది, 60 ఇండ్లు ప్రయాణం చేయునప్పటికి, నిమిషం ముల్లు ఒక్క ఇంటికి ప్రయాణం చేస్తుంది, ఈ నిమిషం ముల్లు 60 ఇండ్లు ప్రయాణం చేసేటప్పటికి, గంటల ముల్లు ఒక్క ఇంటికి ప్రయాణం చేస్తుంది.

కాబట్టి మన దేహమే ఒక పెద్ద గడియారం. ఈ శరీరమనే దాంట్లో అనేక సత్కర్మలనే సెకండ్స్ చేరినపుడే మనస్సు ఒక పవిత్ర స్థానమునకు చేరిపోతుంది. ఈ మనస్సు అనేక సత్‌చింతలు సలిపినప్పుడే ఆత్మ ఒక పవిత్ర స్థానానికి చేరిపోతుంది. కాబట్టి శరీరముద్వారా సత్కర్మలు, మనస్సంతా సచ్చింతనలు సల్పినప్పుడే ఆత్మ ఆనందస్థాయికి చేరిపోతుంది. ఆత్మ ప్రశాంత స్థితికి చేరే నిమిత్తమై ఈ సత్కర్మలు సత్‌చింతనలు అవసరము. కాబట్టి సత్కర్మలు, సత్ చింతనలు సల్పుటయే జీవితానికి సార్థకత.

## ఆత్మ - పంచభూతములు

నేల, నింగి, వెలుగు - అనునవి ప్రతి జీవికి ఆధారం. అటుపిమ్మట గాలి, నీరు, ఆహారం ఈ మూడు లేకపోతే జీవులు జీవించుట కష్టం. ఎక్కడ ఆత్మ ఉండునో అక్కడ నీరు, గాలి ఉంటాయి. నీరు, గాలి లేకపోయినప్పటికీ ఆత్మ ఉండవచ్చు. కాని ఆత్మ లేకుండా నీరు, గాలి ఉండటానికి వీలులేదు. ఆత్మ నిర్గుణం, అదే నిరంజనం, అదే సనాతనం, అదే నికేతనం కాబట్టి నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, నిర్మల స్వరూపమే ఆత్మ. ఆత్మకు ఏమాత్రం దేనితో సంబంధం లేదు, ఆత్మను పురస్కరించుకొనే ఇవన్నీ పోషించుకోవడం జరిగింది. అందులకే జీవులు జీవిస్తున్నాయి. కొడుకులు లేని తండ్రి ఉండవచ్చు, కాని లోకంలో తండ్రి లేని కొడుకు ఉండడు కదా! అట్లే చేపలు లేని జలం ఉండవచ్చు కాని జలం లేకుండా చేపలు ఉండటానికి వీలుకాదు. గాలి, నీరు లేకుండా ఆత్మ ఉండును గాని, ఆత్మలేని గాలి, నీరు ఉండటానికి సాధ్యం కాదు. పంచభూతములకు ఆధారం ఆత్మ; ఆత్మనే ఆధారంగా చేసుకొనేవి పంచ భూతములు. ఈ పంచభూతముల స్వరూపమే పరమాత్మ యొక్క దివ్య స్వరూపం. ఈ మహత్తర తత్త్వాన్ని త్యాగ భావముతో అనుభవించడమే భోగముతో సమానము.

## ప్రేమ తత్త్వం పెంచుకో

ప్రేమరహిత హృదయంలోపల ప్రేమపంట పండదు. ప్రేమపంట లేనప్పుడు ప్రేమ ఫలము ఎట్లు కనిపిస్తుంది? ఈ రీతిగా గోపికలు కృష్ణుని కోరారు,

"కృష్ణా! మా హృదయాలు ప్రేమరహితమైన మరుభూములుగా ఉంటున్నాయి. ప్రేమాంకురములు మా హృదయ క్షేత్రములో పెంపుచేయాలని మా కోరిక. అది నీరు కోరుతోంది. ప్రేమ సుధావర్షమును వర్షింపగచేసి, ప్రేమనదులు ప్రవహింపగా నీ మురళీ గానమును హాయిగా సాగింపుము. ప్రేమ పలుకులే సుధా వర్షము, ప్రేమలేని హృదయమే మరుభూమి, ప్రేమ ప్రసారమే జలము, ప్రేమ ఫలమే మా ఆనందము."

ఆనందమనే ప్రవాహమే ప్రేమసముద్రము. కనుక ఈ అనుగ్రహ సముద్రములో ఈ అల్పమైన జీవి అంకితము కావాలనుకొన్నప్పుడు ప్రేమతత్త్వాన్ని పొందాలి. దీనినే త్యాగముతో కూడిన భోగము అంటారు. దేహసంబంధమైన, మనోసంబంధమైన భోగము - అది ఒక భోగము కాదు. ఆత్మసంబంధమైన భోగము సహజ సిద్ధమైన భోగము. ఇది కల్పితము, కృత్రిమము కాకూడదు; కేవలము ఆత్మానందముతో నిండియుండాలి. విద్యార్థులారా! ప్రేమ చేతనే ప్రపంచాన్ని దేదీప్యమానముగా వెలిగించండి. ఈనాడు ప్రేమ అనేది శూన్యమైపోయింది. మనిషికి, మనిషికి మధ్య పచ్చగడ్డి వేస్తే, భగ్గుమంటుంది. కనుక ప్రేమను పెంచుకొని యావత్ప్రపంచాన్ని విశ్వమానవ ప్రేమతో అభివృద్ధిని చేయండి.

—శ్రీవారి దివ్యబోధ
24—5—1991,
బృందావనం.



# ఆత్మార్పణం

ఆకు కోసిన వృక్ష మాకులవడునేమొ
ఇదె తనూపత్ర మర్పింతు స్వామి!
పూలు గిల్లిన లతల్ తూలి వ్రేలాడునో
ఇదె మనఃపుష్ప మర్పింతు స్వామి!
ఫలము త్రుంచిన రామచిలుకేమి పలుకునో
ఇదె కర్మఫలము నర్పింతు స్వామి!
తోయంబు గొన నదీకాయంబు కలగునో
ఇదె బాష్పతోయ మర్పింతు స్వామి!

పత్రమో! పుష్పమో! మఱి ఫలమొ! జలమొ!
లోటు రానీయ నున్నంతలోన స్వామి!
ఒకరి వస్తువు లడిగి తేనోపగాని
"నాది" యన్నది సర్వమ్ము "నీదె" స్వామి!

—కరుణశ్రీ

# మానసార్చన

ఏర్పాటు చేసితి ఇందుశేఖర! హృద
యంబులో రత్న సింహాసనంబు
సమకూర్చితిని దయాసాంద్ర! స్నానార్థమై
నిగమ మానస వాహినీ జలంబు
అర్పించుచుంటి మహాదేవ! రసచిన్మ
యానంద కావ్య దివ్యాంబరంబు
కై సేసితిని సాంబ! గంధబంధుర భావ
సౌందర్య వివిధ పుష్పవ్రజంబు

పరిమళ ప్రభా ధూప దీపంబు లివిగొ
ప్రేమ ఫలరాజి తెచ్చి నైవేద్యమిడితి
జ్ఞాన భాస్కరా! సాయీశ్వరా! నమస్సు
లందుకో! ఆప్త బంధు! ఆనంద సింధు!

—శాంతిశ్రీ

# ప్రేమమయి - సత్యసాయి

భువిపై ధర్మం నశించినవేళ, అధర్మం తాండవమాడేవేళ దుష్టశిక్షణ, శిష్టరక్షణ కొరకు తాను అవతరించెదనని శ్రీకృష్ణ భగవానుడు గీతలో పలికెను. ఆ ప్రకారమే భగవంతుడు యుగయుగాలయందు భువిపై అవతరించి ధర్మస్థాపన చేయుచున్నాడు. అదే విధంగా ఈ కలియుగమందు కూడా భగవంతుడు ధర్మమును స్థాపించుటకై మానవులలో ఉన్న అహంకార స్వార్థములను కూకటివ్రేళ్ళతో పెకలించి ప్రేమను పెంపొందించుటకై అవతరించెను.

కమల నయనములతో, ఐదడుగుల ఎత్తుతో, ఒత్తైన జుట్టుతో, ఎల్లప్పుడు పెదవులపై చెరగని, తరగని మందహాసముతో, కాషాయాంబర ధారియై, మన మధ్య మసలే ఆ సుందరమూర్తిని ఎవరని ఊహించి చెప్పగలరా? ఆ సచ్చిదానంద సౌందర్యమూర్తియే మన భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబా. సాయిబాబా అను పదంలో సాయి అనగా 'తల్లి' అనియు, బాబా అనగా 'తండ్రి' అనియు అర్థము. సాయి= స + ఆయి అనగా దివ్యమైన తల్లి అని అర్థము. తల్లి ప్రేమ స్వరూపిణి. భగవంతుని పట్ల ఉన్న ప్రేమను భక్తి అంటారు. తల్లి నిరాకారమైన ప్రేమకు సాకార చిహ్నము. నిరాకారుడైన భగవంతుడు, నరాకారములో భువిపై శ్రీ సత్యసాయిగా అవతరించి, తమ ప్రేమ బోధనల ద్వారా స్వార్థము, అసూయలచే నిండియున్న మానవ హృదయాలలో ప్రేమబీజములను నాటుటకై నిర్విరామ కృషి సల్పుచున్నారు.

సత్యసాయి ప్రేమమూర్తి. అందుకే శ్రీవారు ఇచ్చే ప్రతి దివ్యోపన్యాసంలోనూ "ప్రేమ స్వరూపులారా" అని సంభోదిస్తారు. స్వామి ప్రేమ స్వరూపులు, కనుక సకలజనులు ప్రేమస్వరూపులుగా అగుపిస్తారు. అందువలననే "సాయి అష్టోత్తర శతనామావళి" యందు ఆయనను "ప్రేమాత్మనే నమః", "ప్రేమమూర్తయే నమః", "ప్రేమప్రదాయ నమః" అని కీర్తిస్తున్నారు. ఆయన ప్రేమ అనుభవపూరితం కానీ, అభివర్ణించుట ఏ మానవ మాత్రునికి సాధ్యం కాదు. ఈ విషయం నిర్వివాదం. మహర్షులంతటి వారికి సాధ్యం కాలేదు. ఇక మనబోటివారికి ఎలా సాధ్యమవుతుంది?

ఖండ ఖండాంతరాలలో ఉన్న ప్రజలు సాయిని చూచుటకై ఎన్నెన్నో వ్యయ ప్రయాసలకోర్చి పుట్టపర్తికి వచ్చి కేవలం ఆయనను దర్శించుకొనుటకు ఇంత తహ తహలాడుచున్నారంటే కారణం వేరేదియు లేదు- కేవలం ఆయన ప్రేమ. ఆయన ప్రేమను మానసికంగా అనుభవించి, తమ జన్మలను ధన్యం చేసుకోవాలన్నదే భక్తుల ఆశయం.

సత్యసాయి ప్రేమమూర్తి మాత్రమే కాదు, ఆ భగవానుడు కరుణామూర్తి. దయకును, కరుణకును కొంత వ్యత్యాసము కలదు. దీనులు, ఆర్తులు, రోగులు మొదలైనవారు అర్థించిన, వారికి తోడ్పడుట దయాగుణం. వారు అడుగకనే వారి స్థితిని చూచి జాలితో తోడ్పడితే

కరుణ అనవచ్చును. ఎదుటివారి నిస్సహాయత, దైన్యం చూచి స్పందించి సహాయం అందించేది కరుణ. మన భగవానుడు కరుణామయుడని అందరము గ్రహింపగలము. ఆ మహాపురుషుని కరుణార్ద్రదృక్కులు కేవలం చుట్టూ ఉన్నవారిపైననే కాకుండా, విశ్వ మానవ ప్రపంచములోని సర్వజీవరాసులపైన ప్రసరిస్తున్నదన్న మాట ప్రస్ఫుటం, నిర్వివాదం కరుణామయుడు కావుననే "భయమేల సాయి ఉండగా, భక్తుల పాలిటి అండగా" అని అభయం ఇచ్చుచున్నారు ఈ అభయ ప్రదాయి సాయి.

విదేశీయ సంస్కృతి, సాంప్రదాయాల వ్యామోహంతో భారతీయ సంస్కృతి. సాంప్రదాయ వారసత్వమును విస్మరించి, అజ్ఞానాంధకారములో దారి తప్పిన మనకు సనాతనసారథ్యము వహించి, ఆధ్యాత్మికోన్నతిని అనుగ్రహించుచున్నారు. భజన, నగర సంకీర్తన, సేవ, బాలవికాస్, పాఠశాలల స్థాపన, విశ్వవిద్యాలయ స్థాపన ఇవన్నియు జగన్మాత యొక్క జగదోద్ధరణ అను విషయమును విశిష్టముగా చాటుచున్నవి. బాలబాలికలు దేహదారుఢ్యం, మానసిక వికాసం, బుద్ధి కుశలత, సేవాతత్పరత, వినయవిధేయత, దేశభక్తి మొదలైన అత్యుత్తమ లక్షణాలు పెంపొందించుకొనవలెనన్నది సాయి ఆశయము.

స్వామి ప్రేమస్వరూపుడు. ప్రేమనిధి. ఆ పరమాత్మ ప్రేమ ద్వారా ప్రకటితమౌతారు. సాయి ప్రేమ తత్త్వం పరమపవిత్రమైనది. మన హృదయాలలో స్వామికి ఎటువంటి స్థానమిచ్చెదమో, అట్టి ఫలమే పొందెదము. మానవరూపంలో అవతరించిన భగవానుడు భక్తవత్సలుడు. సమస్త జనులు ఆ దివ్య చరణారవిందముల చెంతకే చేరుచున్నారు. కారణం: స్వామి నిర్మల, నిస్వార్థ, నిష్కల్మషమైన ప్రేమ. ఆ భక్తప్రియుని ప్రేమ, వైశాల్యములో క్షీరసముద్రాన్ని మించినది. దాని వైశాల్యం మానవ బుద్ధికి అందదు. ఆ ప్రేమసాగరుని పొందుటకు భక్తి యొక్కటే సాధనము. ఆ సర్వేశ్వరుని ప్రేమను, అనుగ్రహమును సమకూర్చగల శక్తి భక్తికే కలదు.

"భక్త సంరక్షణ" స్వామివారి కార్యకలాపాలకు ప్రధాన లక్ష్యము. స్వామి అభయ ముద్రతో, ఆనందసముద్రంలో సంవత్సరాలు క్షణాలుగా కరిగిపోతాయి. స్వామి విద్యాలయాలలో చదివే విద్యార్థినీ విద్యార్థులందరికీ ఈ విషయము అనుభవ పూరితమే. భగవాన్ ప్రేమ పశుపక్ష్యాదుల పట్లకూడా ప్రసరిస్తున్నదని అందరికీ విదితమే. పర్తిలో సాయి గీతను, బృందావనంలో లేళ్ళను, కుందేళ్ళను చూచినప్పుడు ఆ విశ్వప్రేమ మనకు స్పష్టమవుతుంది. ద్వాపరయుగంలో ఆ గోపాలకృష్ణుడు ఎచటకేగినను గోవులుకూడా ఆ మురళీ గానమును అనుసరించెడివి. ఈ కలియుగంలో ప్రశాంతి నిలయం మందిరంలో ఎల్లప్పుడూ పక్షులు తమ ఆనందాన్ని కిలకిలారావాలతో వ్యక్తం చేస్తుంటాయి. స్వామి మందిరంలో లేనప్పుడు ఆ పక్షులు అగుపించవు, వాటి శబ్దాలు వినిపించవు. స్వామిని అనుసరించి ఆ పక్షులు వెళ్ళినవేమో అనిపిస్తుంది.

స్వామి సర్వహృదయ నివాసి. ఆ సర్వాంతర్యామియైన సాయి అణువణువున నిండియున్నాడు. ఆ పురుషోత్తముని ప్రేమ స్వయంప్రకాశం. సాయి ప్రేమ సర్వవ్యాపకమైనప్పటికీ, సర్వులు దానిని అందుకొనలేరు. కొందరు మాత్రమే ఆ మాధుర్యమును అనుభవించి ఆనందించెదరు. కారణమేమి? సాయి ప్రేమను అర్హులే ఆశించి, అనుభవించగలరు. ఇతరులు దానిని కాంచలేరు, కనుగొనజాలరు. సర్వవ్యాపకమైన సాయిప్రేమను అందుకొనదలచినవారి హృదయము ప్రేమమయం కావాలి. ఏలనిన "దయగల హృదయమే దైవమందిరం". మందిరంలో సాయిప్రేమను, సౌందర్యాన్ని ఆస్వాదించినవారు తన్మయత్వంతో పరవశించిపోతారు. "ఎన్నగ మనస్సుకు రాని పన్నగశాయి సొగసు పన్నుగ కనుగొనలేని కన్నులేల" అంటారు త్యాగరాజు. అందువల్ల

భగవద్దర్శనమునకు, అమృతోపమానమైన ప్రేమను గ్రోలుటకు మనస్సు, వాక్కు, దృక్కులు పవిత్రం చేసుకోవాలి.

మానవుని మాధవునిగా మార్చుటే సాయి ప్రయత్నము. ఆ ప్రేమకు, ఆ కరుణకు పాత్రులమై అమృత పుత్రులయ్యేందుకు మనమందరం కృషి చేయాలి. ఆ జగన్మోహనుడు వెలసిన ఈ భరతభూమి - ఆ జగన్నాటక సూత్రధారుని లీలలకు తావైన ఈ చిత్రావతీ నదీతీరం ఎంత ధన్యమైనవో కదా! ఈ పావన మూర్తికి సమకాలికులమై జన్మించిన మనమందరం ధన్యులం. ఈ మహత్తర అవకాశం మనకందించిన సాయి భగవానునకు సర్వదా కృతజ్ఞులమై చరించుట మన కర్తవ్యం. అదే మన ధర్మం.

బీటలు వారిన మానసంబున
పన్నీరు చిలికిన పరమాత్మ నీవు
నిస్సారమైన హృదయక్షేత్రమును
సారవంతము చేసిన సాయివి నీవు
శాంతికి సోపానం, ప్రేమకు ప్రతిరూపం
మానవతా విలువలకు సంకేతం
అయిన నీకిదే నా కృతజ్ఞతాభివందనం....

—ఎస్. ఎస్. లావణ్య, బి. ఎస్. సి., ద్వితీయ,
(అనంతపురం క్యాంపస్).



## సాయి సుమములు

పిల్లలం పిల్లలం మనమంతా పిల్లలం
సాయి కల్పవృక్షచ్ఛాయలో ప్రేమాత్మస్వరూపులం
బాలికలం బాలికలం మనమంతా బాలికలం
సాయి విద్యావనంలో పూచిన పూబాలలం
పిల్లలం పిల్లలం మనమంతా పిల్లలం
కాబోయే రేపటి ప్రేమపౌరులం
బాలికలం బాలికలం మనమంతా బాలికలం
సాయి నయనాలలో ప్రకాశించే చిరుదీపాలం
పిల్లలం పిల్లలం మనమంతా పిల్లలం
సాయిమాత ఒడిలో ఒదిగిన పసిపాపలం
బాలికలం బాలికలం మనమంతా బాలికలం
సాయి మకరంద మాధుర్యాన్ని గ్రోలే తుమ్మెదలం
అదృష్టమంటే మనదేనోయ్, అవకాశమున్నది
మనకేనోయ్
బంగారుబాటను చూపే సాయివెంట నడవండోయ్!!

—వి. హరిప్రియ, బి. ఎస్. సి., ద్వితీయ.
(అనంతపురం క్యాంపస్).

## అంతరంగ(ని)వేదన

సాయీ! నీవు సుగంధ సుమానివి.
మధుర మకరంద భరిత మందారానివి.
తేనెసోనలు నిండిన పానపాత్రవు.
గగన కుసుమానివి కావు నీవు.
ధరణిపై వెలసిన దివ్యారవిందానివి
వసుధపై చరియించు భ్రమరాన్ని నేను
ఝుంకార, ఓంకారనాదంతో పరితపించుచున్నా.
నీ మందార, మకరందాన్ని ఆస్వాదించనిమ్మా
విరిజల్లుకై ఎదురు చూచు చాతకాన్ని నేను
నీ ప్రేమార్ద్ర జల్లులు కురిపించవమ్మా!
కౌముదికై వేచియున్న చకోరాన్ని నేను
నీ అనుగ్రహామృతాన్ని అందించవమ్మా!
అక్షరములకందని, అధరములు పలుకలేని
నా అంతరంగ నివేదనను స్వీకరించవమ్మా!!

—ఎస్. సుధారాణి, బి. ఎస్. సి., తృతీయ.
(అనంతపురం క్యాంపస్).